# తగినశాస్తి

(బంగాళీ భాషనుండి)

గ్రంథకర్త;

శ్రీపాద కామేశ్వరరావు




ప్రకాశకుడు:
చెలికువాడ వేంకటరామయ్య
అభినవాంధ్రగ్రంథమాలాకార్యాలయము
రాజమండ్రి
1929.



వెల { మేలు 1—0—0
సాదా 0—12—0

# పీ ఠి క

శ్రీ క్రీ శేషులైన ద్విజేంద్రలాల్ రాయులు రచించిన ప్రహసన మొకటి ఇది వరకు తెలిగించినాము; ఇది రెండోది. దీని మాతృకకాయన "ప్రాయశ్చిత్తము" అని పేరు పెట్టినారు. దానిని మేము కొంత పెంచి హాస్యరసప్రధానమైన నాటికగా మార్చినాము. ఇందు ఇప్పటి ఆంధ్రాచారములు కొన్ని ప్రతిఫలించి యున్నవి.

ప్ర కా శ కు డు.

# ఇందలి ప్రధానపాత్రములు

## పురుషులు

| | | |
|---|---|---|
| ఉమాకాంతము | ... | ఒక గృహస్థు (నవనాగరకుడు) |
| పూర్ణేంద్రుడు<br>సూర్యనారాయణ<br>రామచంద్రుడు | ... | ఉమా॥ మిత్రులు |
| గంగాధరుడు | ... | బారిస్టరు |
| వీరేశ్వరుడు | ... | ఒక ధనికుని సోదరుడు |

## స్త్రీలు

| | | |
|---|---|---|
| సువేషిణి<br>సుకేశిని<br>సుహాసిని<br>సుభాషిణి | ... | పై నవనాగరికుల భార్యలు |
| ఇందుమతి | ... | ఒక సంపన్న వితంతువు |
| సరోజిని | ... | ఇందు॥ చుట్టము |




## మొదటి అంకము

### మొదటి రంగము

(ఉమాకాంత శర్మగారి సావడిలో అతని మిత్రులు—
రామచంద్రుడు, పూర్ణేందుడు, సూర్యనారాయణ)

రామ—పాతగిల్లిన మన పల్లెటూరి పెళ్లా లంటే పరమాసహ్యంగా ఉంది.

ఉమా— నిజమే-వాళ్ళకి పాటా రాదు, పదమూ రాదు.

రామ—కటాక్షవిక్షేపాలు కానరావు వాళ్ళలో.

పూర్ణే—నాగరస్త్రీలలాగు నడువనే లేరు.

సూర్య—తగినరీతిని దగ్గాలేరు, తుమ్మాలేరు.

అందరు— రామ రామ-వాళ్ళ కేమీ తెలియదు.

ఉమా—శుద్ధ మొద్దు స్వరూపాలు!

రామ—పుస్తకము చదువలేరు కదా?

పూర్ణే—ఉత్తరము వ్రాయలేరు కదా?

సూర్య—హాకీ ఆడలేరు, ఫుట్ బాల్ తన్నలేరు.

రామ—వీణె, ఫిడేలూ వాయించలేరు.

ఉమా—కూనిరాగమైనా తీయలేరు.

అందరు—వీళ్ళతోడి పొందు రోత! ఏదీ చేతకాదు.

పూర్ణ—చక్కగా సింగారించుకోనే లేరు.

సూర్య—బైసికిల్ ఎక్కనేలేరు.

రామ—మోటారు తోలనేలేరు.

ఉమా—పదిమందిలోకి రానేలేరు.

పూర్ణ—లెక్క డొక్క తెలియదు.

సూర్య—ఊల్ వర్కు చేయలేరు.

రామ—డ్రామాలు నవలలూ చదువలేరు.

పూర్ణ—వీళ్ళని చూస్తే నాకొళ్ళుమంట.

సూర్య—వీళ్ళనూ టంటే తలనొప్పి నాకు!

ఉమా—బాగా చెప్పినావు-రుచి చచ్చింది-ఇంగ్లాండు వెళ్ళివచ్చిన వాళ్ళపెళ్ళాలని చూస్తే ఎంతో ముచ్చట వేస్తుంది. పదిమందితో కలిసిమెలసి ఉండడము వాళ్ళకే చేతనౌను.

రామ—వాళ్ళ గౌను చూస్తే కన్నుపండుగగా నుంటుంది.

సూర్య—ఎంతో చక్కగా పుస్తకాలు, న్యూస్ పేపర్లూ వాళ్ళు చదువగలరు.

ఉమా—పెళ్ళాలంటే వాళ్ళే పెళ్ళాలు, మనవాళ్ళు పెద్దమ్మలే.

అందరు—శాబాస్, బాగా చెప్పినావు.

రామ—వీళ్ళు కోమలాంగులు కారు కొయ్యబొమ్మలు.

పూర్ణే—చెత్తకుప్పలు.

సూర్య—వాళ్ళకన్న మూగవాళ్ళు నయము.

అందరు—సందేహమా? సత్యమే.

ఉమా—సరే, ఐతే సాధనాంతర మేమి?

రామ—మన ఈజన్మమే వృథా-ముందుజన్మములో చూతాము.

పూర్ణే—ఇంకో జన్మ ముంటేనా?

సూర్య—మనము చేసిన పుణ్యానికి ఇంకో జన్మము కూడానా?

ఉమా—ఎందు కీచర్చ? ఉపాయమేదైనా చూడండి, ఊరకే గోల ఎందుకు?

పూర్ణే—నా కొకటి తట్టింది-వీళ్ళ పీకలు పిసిగితే వీళ్ళు చస్తారు, అప్పుడు తగినవాళ్ళని పెళ్ళాడవచ్చును.

ఉమా—సరిసరి-ఖూనీచేస్తే కోర్టుకి లాగుతారు.

పూర్ణే—ఔనౌను-మరచిపోయినాను.

రామ—వాళ్ళంతట వాళ్లు చస్తే ఏచిక్కూ_ఉండదు.

పూర్ణే—అలాగు వాళ్ళు చస్తారా?

సూర్య—భర్తని సుఖపెట్టడానికి భార్య లెందరు చావలేదు? ఆడవాళ్ళాత్మహత్య చేసుకోగలరు?

ఉమా—మ రేదైనా సాధన ముంటే చెప్పరాదా?

సూర్య—పోనీ, వీళ్ళని divorce చేతాము, శని వదలిపోతుంది.

రామ—సరిసరి. మనలో అది లేదు. హిందూ లా ప్రకారము వీలులేదు. వివాహసంబంధము విడిపోదు.

సూర్య—అయ్యో! మనఋషుల కెంత మతిపోయింది!

పూర్ణే—రామచంద్రం, నీ వేదైనా సాధనము చెప్పవా?

రామ—నా కొకటి తోచింది, మనకు నచ్చినదాని నింకొకర్తెను పెళ్ళాడడమే; దానితో వీళ్ళ చిక్కు మగుండదు; "అధికం తు న దోషాయ" అని శాస్త్రకారుడే చెప్పినాడు.

పూర్ణే—అది నాకు నచ్చలేదు.

ఉమా—ఏమి?

పూర్ణే—బాబో! ఒక్కర్తెను కట్టుకొంటేనే ఇంటి నిండా కిచకిచలాడుతూ కిష్కింధ ప్రత్యక్ష మయిందే, రెండో దాన్ని చేసుకొంటే లంకాపురి కావడాని కాటంక ముందా?

సూర్య—అదీ కాక, ఒక్కర్తెతోనే వేగలేక తంటాలుపడి తన్నుకొంటూంటే రెండోదాన్ని పీక కురిపోసుకో మన్నావా?

ఉమా—మన మట్టిబుర్రలకి మంచిమార్గము తట్టనే లేదు-ఏమి గతి? (పాత్రుడు వచ్చును) Good-morning పాత్రాగారూ!

పాత్రు—Good morning, my friends! మీరంతా ఇక్కడేమి ఆలోచిస్తూన్నారు? What news? విశేషాలేమి?

ఉమా—మే మందరమూ ఒక చిక్కులో పడ్డాము.

పాత్రు—What is the matter? సంగతేమిటి?

పూర్ణే—మా పెళ్ళా లందరూ వట్టి మూర్ఖులు.

సూర్య—వాళ్ళతో బాధ పడలేక లేచిపోదామా అనుకొంటున్నాము.

పాత్రు—Indeed! అలాగా?

ఉమా—వాళ్లని చంపడానికీ వీలులేదు.

రామ—విడిచిపెట్టడానికీ వీలులేదు.

పూర్ణే—ఇంకో రైను కట్టుకుంటే ఇల్లు గుల్లవుతుంది.

సూర్య—ఇంకేమి సాధనము?

పాత్రు—By Jupiter! There is a way out of the crux మంచి ఉపాయముంది దాటడానికి.

అందరు—ఏమిటది?

పాత్రు—To file a suit! • వాళ్ళమీద దావా తేవడమే.

రామ—ఎడిచిన ట్లుంటుంది.

పూర్ణే—పెళ్ళాంమీాద దావా?—చచ్చినాము రా బాబూ! గెల్చినా కష్టమే ... ఓడినా కష్టమే. అది వీలు లేదు.

పాత్రు—వీలులేదా? Bombay High Court లో ఒక ruling ఉంది...కాని I shall suggest another remedy, ఇంకో మార్గము చెప్తాను.

అంద—ఏమైనది చూడండి.

పాత్రు—Very easy-అతిసులభము. It is as easy as to drink a peg of whisky— మంచి నీళ్ల ప్రాయము.

రామ—చాలా సుళువన్న మాటే.

పాత్రు—Oh my! The more you think of it, the easier it would seem. ఎంతాలోచిస్తే అంత సుళు వనిపిస్తుంది.

పూర్ణే—మమ్మల్ని చంపక త్వరగా చెప్పవయ్యా.

పాత్రు—By Venus and Adonis, you have only to follow your nose ముక్కుకి సూటిగా ముందుకి పోవడమే.

సూర్య—ఎలా గెలాగు?

పాత్రు—ఇప్పుడు • problem ఏమిటంటే—మీా పెళ్లాలు uneducated అనే కదా?

అందరు—ఆ. అదే, అదే.

పాత్రు—అలాగైతే educate them వాళ్లకి చదువు చెప్పండి.

ఉమా—ఇది బాగుంది, కాని వికటిస్తుం దేమో?

రాము—ఎంత సులువైన మార్గము! మన కెవరికీ తోచలేదు!

ఉమా—పెద్దవాళ్ళయ్యారు కదా, వీళ్ళకి చదువబ్బుతుందా? వీళ్ళు చదువుకొంటే మనమాట వింటారా?

పాత్రు—Quite well. మీరు Ainsli's Evidence Act చదువలేన ట్టుంది.

ఉమా—చదువుకుంటే వాళ్ళ కేమి వస్తుంది? తెగ నీల్గుతారేమో?

పాత్రు—Everything that we do. మనము చేసే పనులన్నీ వాళ్ళూ చేయగలరు.

ఉమా—మగవాళ్ళే ఉద్యోగాలు లేక మాడుతూంటే ఆడవాళ్ళూ అలాగే చెయ్యవలసి వస్తుందేమో?

సూర్య—ఆడవాళ్ల కందరూ ఉద్యోగమిస్తారు. వాళ్ళు కచ్చేరీలకి వెళ్ళితే మనము వంటిల్లు చేరవలసివస్తుందేమో?

పూర్ణే—అది బాగా నే ఉంటుంది. మన మిన్నాళ్ళూ వాళ్ళని కోసుకో తిన్నాము-ఇప్పుడు వాళ్ళు మనని కాల్చుకో తింటారు. ధనమార్జించడపు కష్టము వాళ్ళకీ తెలుస్తుంది; తెచ్చినదానితో కాలక్షేపము చేయడపు కష్టము మనకీ తెలుస్తుంది.

ఉమా—చదువు చెప్పించడము సులభమే కాని తరువాత గ్రంథము తాడు తెంపేట ట్టుంది. ఈపని చాలించుదాము ఇప్పటికి—కొన్నాళ్ళు పోనీ.

పాత్రు—By way of variety you can en
the fun. ఆవైభవమూ అనుభవించవచ్చును.

ఉమా—బాబో...ఏ వైభవమూ వద్దు. ఆడద
అదిమి ఉంచినాముగనుకనే ఇలాగుంది—పట్టు వదలితే భ
గలమా? ఇప్పుడే నెత్తెక్కి పిండి దంచుతూన్నారు.
పైని మనకు కమ్మిచ్చి దెబ్బలు తగులడము తప్పదు.

సూర్య—నీ వెప్పుడూ అడ్డుకర్ర వేస్తునే ఉంటా

పాత్రు—Obstructionist tactics lead us
where. ఇలాగైతే పని సాగదు.... By Hercul
ఉమామహేశం, నీవు Europe వెళ్ళిఉంటే గద్యము
పద్యముగాని వ్రాయు లేని lady ఉండడము quite a phe
menon అని తెలిసికొనుందును. My goodness, అన్న
నములవలె newspaper అత్యవసరమైన వస్తువన్న మ
అదీకాక యిప్పుడు వాళ్లుచాలా improve అయిన
Football కూడా ఆడుతూన్నారు.

సూర్య—అలాగా? మనతో match ఆడుమ
బాగుండును.

ఉమా—కొత్తదారి గోల పెట్టించి తీరుతుంది.

పూర్ణే—ఏమైనా సరే, తొక్కి తీరుదాము.

(వీరేశ్వరుడు రొజుతూ వచ్చును)

వీరే—నన్నెలాగు కొట్టినాడో చూడండి.

పాత్రు—Assault? Hurt? దావా చేతాము

ఉమా—కొట్టిన దెవడు?

వీరే—దుకాణదారు.

రాము—ఎందుకు?

వీరే—కొంచెము నల్లమందు తీసినందుకు.

పూర్ణ—దానికి డబ్బిచ్చినావా?

వీరే—నాదగ్గర లేనిదే.

సూర్య—ఇవ్వకపోతే కొట్టడమా?

పాత్రు—అంత మాత్రానికే కొట్టడమా? డబ్బు కావలెనంటే దావా చెయ్యవచ్చును. Civil suit తేనీ-కొట్టడానికి వాడికి right ఎక్కడిది? పదవయ్యా దావా చేతాము. మొదట వాడిని identify చెయ్యి- తర్వాత summons పంపుదాము.

వీరే—బాబూ! ఒక్కమాటు మీరు రండి-నన్ను చితగకొట్టినా డండి!

(పోవుదురు)



## —। రెండో రంగము ।—

ఇందుమతీ సరోజినులు.

ఇందు—మాటాడ వేమే?

సరో—నానోరు కట్టిపోయింది.

ఇందు—ఎందుచేత?

సరో—నీ అవస్థ చూడడముచేత. నీలాటి తలచెడ్డవాళ్ళందరూ దేవుళ్ళ నారాధిస్తూ రామాకృష్ణా అంటూ ఏలాగో కాలము గడుపుకొంటూ ఉంటే ఇదేమిటి నీ వేషము? దేవబ్రాహ్మణపూజా లేదు; వ్రతాలు, పండుగా పరం నోములూ అనవు-ఇంత విరుద్ధముగా వ్యవహరిస్తూన్నా వేమే?

ఇందు—ఏం చెయ్యమన్నావు? నామనసుకి ఊరట లేదు. అ దేలాగు తల్లడిల్లుతూన్నదో నీకు తెలుసునా?

సరో—నీవే చెప్పు చూతాము.

ఇందు—పాడాలనిముచ్చట, శారీరము లేదు; నవ్వాలనుంది, పళ్ళులేవు; జుట్టుదువ్వి సిగ ముడుచుకోవలెనని ఉన్నది, కొప్పు లేదు; ఆగర్భశ్రీమంతురాలలా గుండాలని ఉంది, అరచేత గుడ్డిగవ్వ లేదు-ఇటువంటివాళ్ళ మన స్సెలా గుంటుందో నా మన స్సలా గుంది...ఉన్న మాట చెప్పుతూన్నాను-ఏ అయ్యనో కట్టుకొని కాలము గౌరవముగా గడుపుకోవలెనని ఉంద; తగినవాడు దొరక లేదు...ఇప్పుడు బోధపడ్డదా?

సరో—ఇం తాలోచ నుందా నీకు?

ఇందు—శీతాకాలములో ఆకురాల్చిన చెట్టులాగు, ఎండాకాలములో గరికపోచలేని పొలములాగు, వర్షాకాలము లో నీటితోనిండిన మైదానము లాగు దారీతెన్నూ కనబడ లేదు-ఆవ తిన్న పసులములాగు అటూ ఇటూ ఏమీ తోచ కుండా ఉంది-పరిపరివిధముల పరుగు లెత్తుతూన్నది పాపిష్ఠి మనస్సు. ఏమి చేయుమన్నావు?

సరో—నీదశ చాలా విచారగ్రస్తముగా నుంది.

ఇందు—ఏమి చేయుమంటావు? గాలి కాడు ఎండర టాకులాగు తటతటా, పంజరములో పిట్టలాగు పటపటా కొట్టుకొని పై కెగురచూస్తూన్నది. అప్పుడే పుట్టిన ఆవు దూడలాగు అటూఇటూ పడుతూ లేస్తూంది. నాగతి ముం దేమి కాబోతుందో చెప్పగలవా?

సరో—అనుకూలంగానే ఉంటుంది నీమట్టుకి... పగలూ రాత్రీ పంచదార, మీగడపాలూ, గోధుమపిండీ నెయ్యి కడుపునిండా పట్టిస్తే పరిపరివిధముల పరుగు లెత్తదా నీ మనసు? ఋషులు తెలివితక్కువవాళ్ళయి వితంతువులను ముతకబియ్యము ముతకపప్పు అరటికాయా పగటిపూటే తినుమన్నారనుకొన్నావా? తలదువ్వుకోవద్దని, పలచని బట్టలు కట్టుకోవద్దనీ నగలు పెట్టుకోవద్దనీ శాస్త్రాలు మొర పెట్టుతూన్నవి కావా?...నేను చెప్పితే విన్నావుకావు-ఫల మనుభవించక తీరుతుందా?

ఇందు—నే నాలాగు చేస్తే నాసంపద ననుభవించే వాళ్లెవరే? నాకు సుఖ మెలాగు వస్తుందే?

సరో—సొమ్ము తినేవాళ్లు లేరనా విచారిస్తూన్నావు? నీకు బదులు నే ననుభవించలేనా? మావాళ్ళందరూ చిన్నప్పుడే గతించినారు. ఇప్పుడు పెద్దపడుచు నైనాను పెళ్ళి చేసుకొందామంటే పైసా లేదు-విధంతప్పినదానికి విత్తముంటే ఇదే బాధ-అక్కరలేకపోయినా నీకు అమితమైన ధనముంది, కావలిసినా నాకు కాసులేదు. ఇంత వైపరీత్య మెక్కడైనా ఉన్నదా?

ఇందు—నీవు పెళ్ళి చేసుకొంటావా?

సరో—చేసుకోక చెడుతిరుగుడులు తిరుగు మన్నావా?...అది నాచేత కాదు...తగినవాడు దొరకవలెనంటే ధన ముండితీరవలెను కదా ఈ దినములలో.

ఇందు—తగినవాడిని కూర్చుకో, ధనము నే నిస్తాను. ఎవడిమీదైనా కన్ను వేసినావా?

సరో—ఒకడిని చూచినాను కాని...అయ్యో!

ఇందు—ఎవడినో చెప్పుచెప్పు.

సరో—చెప్పేమి లాభము-అందరాని పండు!

ఇందు—అయ్యో పాపము! ఊరుకో ఊరుకో!

(వీరేశ్వరుడు వచ్చును)

వీరే—వదినా! నాకు పెళ్ళి చేసుకోవాలని ఉంది.

ఇందు—పెళ్ళాడుతావా? ఎవర్తెని?

వీరే__అది చెప్పలేను-పెళ్ళి కావడముతో నే పనీ పాటూ లేకుండా హాయిగా కాలుమీద కాలువేసుకొని కూర్చుండడానికి వీలున్నదానిని పెళ్ళాడవలెనని ఉంది-భాగ్యవంతులపిల్ల నెక్కడైనా చూసిపెట్టవూ? అబ్బా! ఇరుగు పొరుగువాళ్ళ దెబ్బల కోర్వలేకున్నాను.

ఇందు__నీకు పిల్ల నివ్వడాని కందరూ సిద్ధపడినట్టు చెప్పుతూన్నావు! ఏ పనీ చేతగాని ఏబ్రాసి నల్లమందు భాయివి, నీ కెవడు పిల్ల నిస్తాడు?

వీరే__ఇవ్వకేమి? నాకేమి తక్కువ? ధనమున్న దానిని చేస్తివా దానిని కనిపెట్టుకొని ఉంటాను. కూర్చున్న దగ్గిరనుండి లేవను.

ఇందు__ఇప్పుడు నీవు చేస్తూన్న రాచకార్య మేమో?

వీరే__నాకు ప్రస్తుత మెంతో చిక్కుగా నుంది. మాత్రకి కావలెనంటే ఎందరి నడిగినా ఎవరూ ఇవ్వరు. కడుపునిండా తినడానికే కరువు వచ్చింది, పదిమందికి పెట్టడానికి మొదలే లేదు.

ఇందు__నీ పెళ్ళిఏర్పాటు నీవే చేసుకో, నాకేమి పట్టింది?...ఆడదాని సొమ్ము తిని హాయిగా కూర్చుంటావా? అందుకు సిగ్గు లేదేమి?...(వెళ్ళును)

వీరే__తా నేమీ చెయ్యదట! నేనే ఏర్పాటులు చేసుకోవలెనట...పోనీ అలాగే కానీ! ఆడదానిసొమ్ము తింటావా అని నన్నీనడించింది. తన మగనిసొత్తు బళ్ళో

వేసుకొని తాను గొప్పది కాలేదా? అలాగే నా పెళ్ళాము సొమ్ము తిని పెద్దవాడి నౌతాను నేను...ఏమే సరోజినీ, నా మాట తప్పా నీవు చెప్పు....ఏమి? అలాగు చెప్పవాల్చ కుండా నావైపు చూస్తున్నావు? ఏమిటి సంగతి?

సరో—(వంకచూపు చూచి నవ్వును)

వీరే—ఊరకున్నా వేమి? (పువ్వుతో కొట్టును)

సరో—బాగుంది! (పువ్వుతో కొట్టి పోవును)

వీరే—ఈ బాలకము కొంచెము లాభించే టట్లుంది. వాఃవా! దీనిని వదల కూడదు.

---

## —1 మూడో రంగము. 1—

---

### బారిష్టరూ మిత్రులు.

పాత్రు—ఇక్కడ నా కేమీ practice దొరకలేదు.

మన్యం—కనబడుతూనే ఉంది. ఏం చేయ బోతావు?

లింగం—Moffusil bar join కావద్దంటే మానినావా?

పాత్రు—ఔను, తప్పే. ఇప్పుడు పట్నము పోనా? I think that is the only course to follow.

వాసం—వద్దు. ఎక్కడికీ వెళ్ళకు. ఇక్కడే ఉండి ఏదో Society లో చేరు త్వరగా నిన్ను Secretary ని చేస్తారు. దానివల్ల కొంతలాభ ముంటుంది.

లింగం—ఎంత కష్టపడి పడినా అది లాభదాయకము కాదు. ఏదో Newspaper కాని Journal కాని start చేస్తే కొంత లాభ ముంటుంది.

మన్యం—మనవాళ్ళు పేపర్లెవరికి కావలెను? ఏదో తెల్లమొగము పూసుకుంటే ఏలాగో వాళ్లైనా support చేస్తారు.

చంద్రం—ఆపాటి తెలివితేటలుంటే ఈపాటి practice improve అయియుండదా? కష్టపడి కడుపు నింపుకోవలెనంటే Bar విడువనక్కరలేదు.

మన్యం—బాగుంది. కష్టపడకుంటే కడుపు నిండుతుందా?

లింగం—Barrister కావడముతోనే Court అనే చెట్టుదగ్గరికి పోతే అల్లోనేరేడుపళ్ళలాగు టంగు టంగని రూపాయీలు చేతిలో పడుత వనుకొన్నాడు! పాపము

చంద్రం—అందరికీ నీలాగే అదృష్టము పట్టుతుందా?

మన్యం—అదేమిటది?

చంద్రం—బంగారు పిచికను పరిణయమైతే పడి తీరుతవి.

పాత్రు—పెళ్ళిచేసుకోవడమా? Well. It is not bad. అందు తప్పులేదు. I am ready to do't.

చంద్రం—Offer yourself to the highest bidder, నీ అదృష్ట మేలాగుంటే ఆలాగు జరుగుతుంది.

లింగం—ఆలాగైతే ఇదే మంచిసమయము. కరుణాకరముగారికి handsome daughter ఒకర్తె ఉంది. He has offered Rs 25000 in cash for a thorough bred stallion. You, old chap—are not a bad one. ఆసంబంధము నీకు అతికుంటుంది.

పాత్రు—By the holy prophet. నిజమేనా? అయితే arrange చెయ్యి. నా కిష్టమే అని చెప్పు.

లింగం—అబ్బో! అది సులభముగా దక్కేది కాదు. అతడు Medical Certificate తెమ్మంటాడు. పదిమందిచేత పరీక్ష చేయిస్తాడు.

పాత్రు—అలాగే కానీ Barkis willing అనిచెప్పు.

లింగం— Go ahead, old chap, my sympathies are with you. కార్యసాధనము కాకతీరదు.

మన్యం—ఇప్పటికే చాలా late అయింది. Come, let us be off. We have got an engagement.

లింగం—పోదాము గాని రేపిక్కడ dinner engagement ఉన్నట్టేనా?

పాత్రు—Certainly. If I am so lucky—

అందరు—Very well then, Good night-ta, ta, ta. (వెళ్ళుదురు)

పాత్రు—These are all gluttons- వీళ్ళంతా తిండిపోతులు. పూర్వజన్మములో వీళ్ళు విరాధవంశస్థులై

ఉంటారు. వీళ్ళకి పాములాగు ఒళ్ళంతా కడుపే. Drink తర్వాత నా కేదీ నోటికి పోదు- జానెడుపొట్టా George Whisky తో నింపితే తిండికి చోటేది? వీళ్ళకి dinners నే నివ్వలేను. Boy, Boy, ఎవరురా అక్కడ?

నౌకరు—బాబూ! వస్తున్నాను.

పాత్రు—గాడిదా! ఏమి చేస్తున్నావు? Rascal, వెళ్ళిచూడు ఎవరేనా clients వచ్చినారేమో.

నౌఖరు—చిత్తం (పోవును)

పాత్రు—తండ్రిగారి ఆస్తి దగ్ధమయింది; ఇప్పటి భోగమంతా బుడ్డీలో ఉంది. ఇనాళ్ళు (unemployment bureau) నిరుద్యోగము department లో కాలము వెళ్ళ బుచ్చినాను. ప్రయాసము లేకుండా practice దొరుకు తుంది; కనబడితే చాలును, ఘల్లుమని రూపాయీలు రాలుత వనుకొన్నాను. కేసురానిదే కేకలు వేయుడమెలాగు?

(తెరలో-పాత్రుడుగారూ!)

ఆ సల్లమందు భాయిలాగున్నాడు, చంపుకో తింటాడు...Come in, my friend.

(వీరేశ్వరుడు వచ్చును)

What news ఏమి విశేషాలు?

వీరే—మీ దర్శనానికే వచ్చినాను.

పాత్రు—తెలుస్తునే ఉంది. ఏదైనా కేసా?

వీరే—కేసే తెచ్చినాను, కొంచె మంసట తీర్చుకొని చెప్పుతాను.

పాత్రు—ఏమి కేసు? Assault? trespass? theft? rioting?...ఇదిగో (పెద్దపుస్తకము తెచ్చి కాగితాలు తిరుగవేసి) rioting section—whoever (వీరే॥ కాదని తల ఊచును) Rioting కాదా? hurt? wrongful confinement? murder? (ఇంకో పుస్తకము తెచ్చి పేజీలు తిరుగవేసి) ఇదిగో చూడు Taylor's Medical Jurisprudence లో ఏ ముందంటే...

వీరే—ఆగవయ్యా! ఇ దలాటి case కాదు. ఇది ఒకాడదానికీ మగవాడికీ......

పాత్రు— Enticing away, Kidnapping? adultery? rape? Oh my! ఆ విషయమున Snell's Equity అని నాదగ్గర ప్రశస్తమైన గ్రంథముంది, అది latest authority.

వీరే—ఆగవయ్యా, ఇ దలాటి case కాదు. ఆతురపడక విను...సంగ తేమిటంటే...నాకు పెళ్ళాడవలెనని ఉంది, మావదినె కానీయకుండా ఉన్నది.

పాత్రు—దావా చేస్తే సరి.

వీరే—ఏమని దావా? ఎందుకోసము?

పాత్రు—ఎందుకు కూడదు? ఈ Civil and Criminal Courts ఎందుకున్నవి? Penal Code దేనికోసము

పుట్టింది? తప్పకుండా తేవచ్చును దావా. Pontifix's Marriage Act ప్రకారము వీలుంది. ఇదిగో Reginald's Law of Financial Catechism లో ఏముందంటే... (పుస్తకము తెరుచును.)

వీరే—అన్నా! గట్టిచిక్కే తెచ్చిపెట్టుకొన్నానురా దేవుడా!...చెప్పేదంతా వినవయ్యా..."పిల్లని చూసుకొని నీవే పెళ్ళిచేసుకో" అన్నది మావదినె.

పాత్రు—అయితే దావా దేనికి?

వీరే—నే ననే దదే- దేనికోసము దావా?

పాత్రు—ఇంతకాలమూ వృధా చేసినావు.

వీరే—నేనూ అదే అందామనుకొన్నాను—మీరు విన్నారా? ఊరకే పేజీలు తిరుగవేస్తున్నారు...పిల్ల దొరకితే పెళ్ళి కాని, పిల్లేది?

పాత్రు—ఏన్నేమి చేయుమన్నావు? బాగానే ఉంది.

వీరే—నాకేమైనా సలహో యివ్వగలరా!

పాత్రు—నేను వివాహాలు కూర్చే వీరయ్య ననుకొన్నావా? పిల్లని వెతకుమని ప్లీడరుదగ్గరకు వచ్చినావా? Fool, damned సువర్!

వీరే—తిట్టుతా వేమయ్యా?

పాత్రు—నల్లమందు నిషాచేత నీకు కిందా మీదా కనబడలేదు.

వీరే—నా పల్లమందుబాధ నీ కెందుకు? నా సొమ్ము పెట్టి నేను కొనుక్కొన్నాను కాని నీ అబ్బ సొమ్మేమైనా యిచ్చినావా?

పాత్రు—Shut up నోరు మూసుకో. Fool, get away పోరా బికారి!

వీరే—మాటలు మాత్రము సరిగా రానీ. ఫూల్ గీ లంటే నే నొప్పుకోను.

పాత్రు— అబ్బా! రోషము వచ్చిందా? Get out, you blackguard. (కర్రపట్టుకొని రాగా వీరే॥ పోవును.) Case మాటేమీ లేదు. Time అంతా waste చేసినాడు. పిల్లని చూసిపెట్టాలట; నేను fool నని వీడి ఊహ. ...Ha! He intends to marry rich అందరిదీ ఒకటే ఎత్తు...మంచిదే...పనీపాటూ లేకుండా పదము గడిచిపోతుంది...నేను కరుణాకర్ కూతురుని పెళ్ళాడితే by the Gospels of St. Zachary నా రొట్టె నేతిలో పడ్డట్టే; ఒక్క క్షణములో I shall become rich, బాగానే ఉంది. మొదట పెళ్ళి కానీ...అందులో but ఒకటుంది...నేనొక European girlని లోగడ పెళ్ళిచేసుకొన్నాను, అదే objection... కాని ఆ marriage ఈపాటికి null and void అయి ఉంటుంది; అంత చతురతతో manage చేసినాను. ఆ wife నన్ను పోల్చుకో లేకుండా మాయచేసినాను?...దాని మాట కేమి...దీనిని పెళ్ళాడితే Twentyfive thousand

rupees hard cash చేతిలో పడుతుంది. అందుచేత this is not bad...పెళ్ళవుతుందా అనేదే problem. ఎందుకు కాకూడదు?...అంతా నా చక్కదనములో నుంది. (అద్దము చూసి దిద్దుకొని) నా అందాని కేమిలోటు? ముక్కు సరిగ్గా Greecian cut; కళ్ళు...Oh my! ఏమి eye-lashes! తరువాత నుదురు...హాయి హాయి, సరిగ్గా Bismark పోలికుంది ... ఇక పళ్ళు...Lovely! very beautifully set pearls. ఎట్టి countenance ఈదేశంలో పడి వ్యర్థమయిపోయింది. Oh! what a pity, my countrymen; చూసి సంతోషించేవాడు లేక this has blushed unseen and wasted its sweetness in this desert continent. అడవి గాచిన వెన్నెలయింది. అయ్యయ్యో!

(పిల్లలిని వెంటబెట్టుకొని చినుగుగుడ్డలతో
రెబెకా ప్రవేశించును.)

రెబె—At last! Oh my God!

పాత్రు—ఇదెవరు?......Rebecca కాదుకదా! Ghost ఏమో?...ఆహా! Rebecca's ghost!

రెబె—I am sure you are Mr. Ganga Ram.

పాత్రు—(నిలువునా నీరై) నేను Ganga Ram నే కాని, నువ్వు Rebecca ghost వేనా? Ghost! Ghost! Oh murder, murder, help! help!

రెబె—I am not a ghost — but I am Rebecca, your married wife in England!

పాత్రు—Really! By St. Andrews నన్ను కనుక్కోఁ గల్గినావూ? How did you find out my address, my angel! నే. నిక్కఁ డున్నానని నీకెలాగు తెలిసింది?

రెబె—Never mind, how you wretch, you scoundrel, you most—

పాత్రు— అన్ని Superlatives ఒక్కసారేఁ? శాంతించు. By Jove! you have grown quite old, my beauty! ముసలిదాన వైనావే—నాచిన్కల కొలికీ!

రెబె—And the child died.

పాత్రు—Did it? poor child!

రెబె—Actually died of starvation.

పాత్రు—Really? Well, You might have just done the same thing. నీవూ ఆలాగే కావలసింది. It would do you good నీ కెంతో ఖ్యాతి వచ్చిఉండును for self—sacrifice.

రెబె—You cruel!-wolf you once pretended to love me (ఏడ్చును.)

పాత్రు—Don't cry! ఊరుకో! There is, my dear- the fact is, I am also starving!—not mentally or morally, but physically starving. .

రెబె.—Then why did you pretend to be a prince when you were in England.

పాత్రు—Did I? (తనలో) నిన్ను వలలో వేయుటానికి—Just to ensnare you—ఎంత ప్రమాదము జరిగింది, దీనిని వదల్చుకోనే మార్గము కానరాదు (ప్రకా) By the holy prophet—Ah well!—Dont you see?

రెబె.— I quite see you, you rogue, you liar, you beast.

పాత్రు—Rebecca dear, నీ arguments చాలా convincing—వాటికి జవాబు నేను చెప్పలేను. నీవు అంధకారబంధురమైన నా యింటిని ప్రకాశమానముగా చేయకోరుతూన్నాను. Come in, dear... (తనలో) నా plan అంతా పాడుచేసింది. అంతా చెడిపోయింది.

---

—॥ నాలుగో రంగము ॥—

---

ఉమాకాంతశర్మగారిల్లు—సువేషిణీ చతుష్టయము.

సువే— ఈవేళ Mrs. Ramanand గారింట్లో engagement ఎన్నిగంటలకి?

సుహా—సరిగ్గా ఐదుగంటలకి.

సువే—ఇప్పుడెంతయింది?

సుభా—నాలుగయిపోయింది.

సువే—ఐతే మీవారింకా కచ్చేరి నుంచి రావడము ఆలస్యము చేసినారేమి? ఆయన వస్తే ఆబండిలో మనము వెళ్లవాలని చెప్పినావు కదా?

సుకే—చెప్పినాను, ఇప్పుడే వస్తారు, చాలా obedient husband మావారు.

సుహా—ఇంటికి బండి ముందుగా పంపి ఆయనను నడచి రమ్మనవలసింది, wait చేయనక్కరలేకపోవును.

సుభా—అదిగో వచ్చినట్లుంది. వేగము powder వేసుకోవలెను లెండి.

సుహా—సువేషిణీ, నీవు powder రాసుకోవూ?

సువే—నాకు powder అక్కరలేదు. మీరంతా పూసుకోండి, ఇంతలో నా part చదువుతూంటాను.

(సువే॥ తప్ప తక్కినవారు పోవుదురు)

(పచారుచేస్తూ) To be, or not to be, that is the question.

(ఉమాకాంతము వచ్చును)

ఉమా—(ఉస్సురని చొక్కా విప్పి) ఏవేఁ ఫలహార ముందా?

సువే—Whether it is nobler in the mind—

ఉమా—వినిపించుకోవేమి? ఫలాహారము చేసినావా?

సువే—To suffer...

ఉమా—ఇప్పుడు నే నాకలితో suffer అవుతునే ఉన్నాను, తిండి కేమైనా చేసినావా? లేదా?

సువే—Or to take arms—

ఉమా—ఏమిటీ వేషము?... చెప్పవేమి?

సువే—against a sea of troubles.

ఉమా—ఇంతసేపూ కచేరిలో చచ్చిచచ్చి ఇంటికి వస్తే Hamlet's soliloquy చదువుతూన్నావా? అది వింటే నాకడుపు నిండుతుందా? కాఫీ నీళ్ళైనా ఉన్నవా?

సువే—ఇప్పుడు disturb చేయకండి, కొంచె మాగ లేదా? And by opposing end them.

ఉమా—అది నాచేత కాదు-నీవీ soliloquy end చేసి కొంచెము నాగోల విను. కడుపు నుండుతూంది, గొంతుక ఎండుతూంది.

సువే—To die, to sleep, to sleep—perchance to dream.

ఉమా—ఇది dream చేయడానికి సమయము కాదు. నాకడుపులో కార్చిచ్చులాగు ఆకలి మండుతూన్నది.

సువే—Ay, there's the rub.

ఉమా—ఔను-ఇదే rub. ఆకలివేయకుండా ఉంటే ఏ గోలా లేకపోవును. ఓదేవి! నీ స్వర్గమునుంచి ఒక్కసారి మా పాపమర్త్యభూమికి దయచేయుము. ఫలహార మేమైనా చేసినావా? కడుపుకాలుతూంది.

సువే.—ఫలాహారమా?

ఉమా—చిత్తము, ఫలాహారమే.

సువే—My goodness! మరచిపోయినాను మీసంగతి.

ఉమా—ఉద్ధరించినావు! నీవు చేసిం దేమిటి? తల దువ్వుకొని, గౌను తొడిగించుకొని, మేజోళ్ళూ బూట్సు తొడుక్కొని పచారుచేస్తూ నీవు పార్టు చదువుతూండు; నేను పస్తుండి ములమల మాడుతూంటాను.

సువే—Eating with another thing or two reminds us of our mortality అని Byron అన్నాడు.

ఉమా—నీ Byron కాలా, నా కడుపులో మండి పోతూందే! ప్రాణాలు నిల్చేటట్టు లేవు.

సువే—మీ ప్రాణాలమాట కేమిగాని నాప్రాణాలు కొరికేస్తూన్నారు. ఇదిగో ఇప్పుడు ఫలాహార మేలాగో చేస్తాను కాని రేపటినుంచి మీ ఫలాహార ప్రయత్నము మీరే చేసుకోండి...ఏమిటిది! తాళముచెవి ఏదీ? (అతనివైపు చూచును)

ఉమా—నా మొగముమీద తాళముచెవి ఉన్నదను కొన్నావా, అలాగు చూస్తూన్నావు? నా కిచ్చినావా?

సువే—అది కాదు-మునుపు పైటకొంగుకి ముడి వేసే దానిని, ఇప్పు డది లేకపోవడముచేత చేతిగుడ్డకి కట్టినాను; అ దెక్కడో జారిపోయింది అలవాటు లేకపోవడముచేత. ఈ సారి గౌనుకి జేబు ఉంచుమని చెప్పుతాను దర్జీతో.

ఉమా—ఎప్పుడో మాట కేమి? ఇంట్లోనే ఉంటుంది, వెతుకుతే దొరకవచ్చును-చూడు.

సువే—నాకు తెరపి లేదు-దాసీ! తాళము వెతుకు మీరుకూడా వెతకండి శ్రమ అనక Mrs. Ramanand గారింట్లో Tea party ఉంది-నా కాలస్యమవుతుంది. (వాచీ చూసి) Hallo! 'tis already late! నేను వెళ్ళాలి (పోవును)

ఉమా—ఏమి దీని తలబిరుసు తనము! రోజురోజుకీ హెచ్చిపోతూంది. ఏమిటి సాధనము? (హతాశుడై పోతూంటే పూర్ణ॥, రామ॥, సూర్య॥, వత్తు॥)

పూర్ణే—ఏమి కాతం, మొగము వేలవేసినావు?

ఉమా—నన్నే సుడుగకు-వెయ్యి నమస్కారాలు.

రామ—ఏమి విశేషాలు ?

ఉమా—పస్తుండడమే పరమవిశేషము.

సూర్య—అదేమి ?

ఉమా—To be, or not to be, that is the question... మీదగ్గర డబ్బేమైనా ఉందా?

పూర్ణే—నాదగ్గ రున్నది, కాని ఎందుకు?

ఉమా—కడుపులో కాలుతున్నదిస్తూ చంపక-(పుచ్చుకొనును)

రామ—సంగ తేమిటి? ఏమి జరిగింది?

ఉమా—జరుగవలసినదే జరిగింది. To be or not to be that is the question.

సూర్య—నీ కేమి మతిపోయిందా ?

ఉమా—To be or not to be—పదండి. ముందు కడుపులో ఏమైనా పడితేనే కాని మంటపోదు. తర్వాత సావధానముగా మనవి చేస్తాను ఏమి జరిగిందో.

పూర్ణే—ఇప్పుడు టూకీగా చెప్పకూడదూ ?

ఉమా—ఏమని చెప్పను ? మీా అందరిమాటా విని ఆడదానిని educate చేసి ఇచ్చి దాని ఫల మనుభవిస్తూన్నాను.

రామ—ఏ మనుభవించినావు ?

ఉమా—రోజంతా గాడిదెలాగు కచేరిలో పనిచేసి కేసు లన్నిటికీ judgments వ్రాసి, సగము చచ్చి, ఇంటి కొచ్చి ఫలాహార మేమేనా ఉందా అని అడుగుతే నా పెళ్ళాము తనకేదో engagement ఉందని ఇంటినుండి ఉడాయించింది. ఈరాత్రి నాకు తిండి ఉండదు-ఇప్పుడే కడుపు కాలి చస్తూన్నాను కదా, ఈరాత్రి నా సంగ తేమికాను ? Female Education వద్దని మొత్తుకున్నా నిందుకే.

సూర్య—ఇదొక స్వల్పవిషయము-వాళ్ళకామాత్రము liberty ఇవ్వాలి. అది స్తేనే కాని education complete కాదు.

ఉమా—ఉప్పు లేకే ముప్పందుము, ఉప్పంటే ఊరు గంజంతా చాల దన్నట్లు వీళ్ళకి liberty కూడా ఇస్తే నాబోటివాళ్లు నాలుక పీకుకొని చావవలసినదే.

పూర్ణే—నీవు గడబిడ చేయకు-మిడిమిడి జ్ఞానమున్న మనవా ళ్ళింగ్లీషు చదువు చెప్పితే ఇలాగే ఉండటుంది; దొరసానులచేత చెప్పిస్తే యీలా గుండదు.

ఉమా—ఇప్పుడు కాకరకాయ అప్పుడు కీకరకాయ అవుతుంది. నే నొక్కడినే తోకలేని తోడేలుని కానులే, We are all in the same boat ఇది కొంత నయము.

రామ—నిజమే. మా కింతకన్న ఎక్కువ మర్యాద జరిగింది, చెప్పుకుంటే సిగ్గు. కడుపు కోసుకొంటే కాళ్ళ మీద పడుతుంది.

పూర్ణే—దొరసా నెక్కడ దొరుకుతుంది? ఎక్కడికి పోను? ఎంతని వెతకను?

సూర్య—ఎక్కడికీ పోనక్కర లేదు, ఎంతోసేపు వెతకనక్కరలేదు. పాత్రుడుగారి దొరసాని ఉన్నది; ఆవిడ చేత చెప్పింతాము.

ఉమా—బాగుంది...అత డెవర్తెనో వితంతువుని వివాహమాడి పాతిక వేలు వడిలో వేసుకొందా మనుకొన్నాడు కాని పాపము శృంగభంగ మయింది. మన మిప్పుడు చేతా మనుకొన్నదానివల్ల మనకే లాభమూ లేకపోయినా అతనికి కొం తుపకార మౌతుంది. అతని కిప్పుడు దినదినగండముగా నుంది- మన మొక తృణమిస్తే కొంత నయము కావచ్చును.

పూర్ణే—అలాగయితే నా కిష్టమే. రేపే నీ వతనితో మాటలాడి తగిన ఏర్పాటు చేయవచ్చును.

ఉమా—మీరందరూ చేయుమన్నారు గనుక చేస్తున్నాను; ఇంతకన్న పాడు కాకూడదు, బాగుపడితే మన అదృష్టము. Shakespeare చెప్పినట్లు Desperate diseases have desperate remedies కుక్కకాటుకి చెప్పుదెబ్బ! పదండి పోదాము.

---

## —| ఐదో రంగము |—

---

ఇందుమతి ఇల్లు—సరోజిని.

సరో—అతనిని పెళ్ళి చేసుకోవలెనని నాకుంది. ఏమి చూసి వలచినావే అని అందరడుగుతారు. అసలే కురూపి, నల్లమందునిషాలో మునిగి యుంటాడు; పుండాఖోరు, అతని కొకర్తెమీద వలపు కానరాదు. కనబడినదాని నెల్ల కదల్చి చూస్తాడు. అన్నిటికన్న గొప్పవిషయము ఆదాయ మేమీ లేదు, అందుచేత అతనిని కోరుకోవడ మాశ్చర్యమే. ఒక్క సుగుణ ముంది, చెప్పినట్లు వింటాడు; నెమ్మదిమీద దారికి తీసుకొని రావచ్చును, హృదయము మంచిది. నా అదృష్టము వల్ల నాలుగుకాసులు దొరికే ఉద్యోగము చిక్కరాదా?... పురుషుని భాగ్యము దేవునికే తెలియదంటారు.

(వీరేశ్వరుడు వచ్చును)

వీరే—ఓహో! (తనలో) ఇక్కడే ఉంది. రూపసే, మావదినె దీనిని నాకు పెళ్ళిచేస్తా నంటుంది; చెడిపోయిం

దేమిటి? దీని మూలముగా నా కార్యసాధన మయితే తప్పకుండా పెళ్ళాడుతాను. కాపురము సరిపడ్డదా మంచిమాటే, లేకుంటే ఇంకొక ర్తె...(పైకి) సరదినా!

సరో—ఓహో మీరా? (లేచును)

వీరే—బాగా ఆలోచించి నిన్ను పెళ్ళాడవలెనని నిశ్చయించినాను. ఏ మంటావు?

సరో—ఇం కెవ్వరూ దొరకలేదు కాబోలు-లేక హాస్యమాడుతూన్నా రా?

వీరే—కాదు- నన్ను పెళ్ళాడవలెనంటే ఒక్కపని చేయవలెను నీవు.

సరో—ఏమి టా పని? మీకోస మేమి చేయుమన్నా సిద్ధమే-అ దసాధ్యపు పని కాదు కదా?

వీరే—అలాటి పని నిన్ను చేయు మంటానా?— సులభమే నీవు తలుచుకొంటే- నాప్రాణాలు నీచేతిలో పెట్టుతూన్నాను...మావదినె పెళ్ళాడేలాగు ప్రయత్నము చెయ్యవలెను. ఆవిడ నీమాట తప్పకుండా వింటుంది-ఆమె నెలాగైనా ఒప్పించాలి. పెళ్లికి.

సరో—ఆమెపెళ్లాడితే మీ కేమి లాభము?

వీరే—(తనలో) ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదు, అస లుద్దేశము దీనితో చెప్పకూడదు. (పైకి) తన పెళ్ళి సిద్ధమయింతంటే మావదినె నాపెళ్ళి కొప్పుకొంటుంది. మన మిద్దరమూ హాయిగా పెళ్ళాడుకోవచ్చును. కొద్ది

గొప్ప డబ్బు ఇస్తుంది- ఇంతకన్న నాకేమి కావలెను?... ఈ ఉపకారము నీవు చేస్తివా నీకూ నాకూ లాభముంది- తెలిసిందా?

సరో—సరే కాని ఆమె వితంతువుకదా మారు మనువు చేసుకొంటుందా?

వీరే—మనదేశములో నెందరు పెళ్ళాడ లేదు?

సరో—అలాగైతే, వెలి కెవ డొప్పుకొంటాడు?

వీరే—విత్త ముంటే వెలి కెవడు వెనుకతీస్తాడు?

సరో—ఆమెకు తగినవాడు దొరకవద్దా?

వీరే—పైసా చూసి పదిమంది చేసుకొంటారు. ఎవరూ లేకపోతే ఉన్నాడుగా మన పాత్రుడు! అత డిప్పు డన్నిటికీ సిద్ధముగా ఉన్నాడు. అరకాసు లేదు వానిచేత.

సరో—అతను కిరస్తాని దాన్ని పెళ్ళాడినాడో!

వీరే—పది రూపాయీలుపార వేస్తే ప్రాయశ్చిత్తము చేయిస్తారు మన గురువులు-

సరో—పెళ్లికి తడొప్పు కొంటాడా?

వీరే—అదే నీవు చేయవలసిన పని-అతనికి సొమ్మ త్యవసరము-ఆతని చెవిని ఈమె సంగతి వేసి నాలుగు మంచి మాట లాడితివా నీవలలో చేప పడ్డదన్నమాటే.

సరో—తీరా ఇదంతా కుదిరిస్తే మీరు నన్ను మరచి పోరు కదా?

వీరే—ఎంత మాటన్నావు! నిన్ను మరచి పోవడమే? నేను చెప్పిన పని నీవు నిర్వహిస్తే నేను చెప్పినమాట సార్థకము చేస్తాను- నిన్ను దగా చెయ్యను, నామాట నమ్ము. ఇదిగో దైవసాక్షిగా ప్రమాణము చేస్తున్నాను. ఇప్పుడు నిజమని నమ్మకము కలిగిందా? మరచిపోకుమా- (వెళ్ళబోతూ) పాత్రుడు నన్ను కొట్టి తగిలివేయుట మొకవిధముగా మేలే అయింది దెబ్బతిని ప్లీడరుదగ్గరికి వెళ్ళి కొంతభోగట్టా కనుక్కొన్నాను- ఈ పని సాధకూరి మైతే ఈపాత్రుడూ మావధినెగార్ల పని పట్టుతాను. నాకు బుద్ధిలేదని నలుగురూ అంటున్నారు-నాసత్తువ చూపుతాను. (వెళ్ళును)

సరో—దీనిలో నేదో రహస్య ముంది. ఇందుమతి పెళ్ళికి ఇతని కింత ఉబలాట మెందుకో? ఇది నేదో పెద్దఎత్తు మీద నున్నట్లుంది...నేను పాత్రుడుగారి యింటికి వెళ్ళడ మేలాగు? అతని పేరు విన్నానే కాని అత డెలాటివాడో ఎరుగను. కార్యము సాధించుకోవలె నంటే కానిపను లెన్నో చెయ్యవలసి వస్తుంది- తీరా అందుకు సిద్ధపడినా నాకార్యము నెరవేరుతుందో లేదో? ఇందుమతి నొప్పించడము సులువే. వడ్డించేవాళ్ళే కొరత, ఆమె ఆకు వేసుకొనే ఉంది.

(ఇందుమతి వచ్చును)

ఇందు—సరోజినీ, నా కెలా గుందేమీ?

సరో—ఏలా గుంది?

ఇందు—ఈ ప్రపంచమంతా ఎడారి లాగుంది, ఆకాశ మంతటా మంటలే, ఎటుకన్నా చూచినా ఏమీ తోచకుండా ఉంది;... మనస్సు పరిపరివిధాల పరుగెత్తుతూన్నది. ఈఅవస్థ కేమని పేరు?

సరో—శోచనీయమైన అవస్థ—విరహము!

ఇందు—ఏమో గాని నా మనస్సు మనసులో లేదు. నాహృదయ మేలా గుందో నేనే చెప్పలేను.

సరో—నేను చెప్పనా?

ఇందు—చెప్పు.

సరో—దాహంలో పడ్డ వెలగకాయ లాగు, కిందకొట్టిన రబ్బరుబంతి లాగు, తెగిన హారము లోని ముత్యాలులాగు...

ఇందు—హాస్య మాడకే. జగత్తంతా శూన్యంగాను, ఆకాశము భయంకరముగానూ, గాలి అంతా వేడిగానూ ఉంది.

సరో—ఆకలిచేత కడుపు మండుతూన్నది, ఎండలో నుంచే తల గిర్రున తిరుగుతుంది...

ఇందు—అదిగో, నీ గుణము నీవు మానవు. నా ప్రాణ మంతా వ్యాకులమయింది... తెలిసిందా? నా అవస్థని తేటమాటలతో వర్ణించ వీలులేదు.

సరో—పోనీ, మడ్డిమాట లుపయోగించు.

ఇందు—పాలులేని పాయసము, పచ్చకర్పూరములేని తాంబూలము, అంచులేని చీరె, శృతిలేని పాట...ఇత్యా

దులలాగు రుచీపచీ లేకుండా, అంతా పాతపడి నిస్సార మయింది - అర్థమూ లేదు భావమూ లేదు ఈ కవితకి.

సరో — నీ అవస్థ కడు జాలికరముగా నుందే- ఇప్పు డేమి చేయుదలచినావు?

ఇందు — ఏదీ తోచదు. నా యవ్వనమంతా కడచి పోతూంది- చక్కని రాజమార్గ ముండగా సందులు గొందులు దూరుతున్నాను. నా హృదయ మనే గోడనుండి కోరిక అనే సున్నము చల్లచల్లగా జారిపోతూంది- ముందేమవుతుందో తోచలేదు- నే నేమిచెయ్యవలెనో చెప్పు.

సరో — వెంటనే పెళ్ళి చేసుకో.

ఇందు — పెళ్ళి చేసుకో మంటావా?

సరో — ఇంకో విధాన ఈ అలమట తీరదు.

ఇందు — అప్పు డప్పు డలాగే అనుకొంటాను కాని పాడుముండ భయము చేసుకోనీయదు. నీవు నా కమిత్రోప కారివి, నా మనసులో మాట చెప్పినావు; ఇప్పుడు నాకు? నచ్చింది. భోజనాని కెక్కడికైనా వెళ్ళితే ఏవస్తువైనా తినాలని ఉంటుం దనుకో, మొగమాటముచేత అడిగి వేయించుకోము, పక్కవా రెవరైనా "మరికొంచెము వేయించుకో" అని హెచ్చరిస్తే వెంటనే వేయించుకొంటాము... పెళ్ళి చేసుకొంటాను కాని ఎవర్ని చేసుకోవడము.

సరో — తగినవాడిని తరచి చూసుకోవాలి.

ఇందు — అపని నాచేత కాదు, నీవు చూసి పెట్టవూ?

సరో—యత్నము చేస్తాను- కావలసినవాళ్ల కోసము కష్టపడక తీరుతుందా? ఎంతకష్టమయినా సాధించి తీర వలెను. నాకు నచ్చినవాడు నీకు నచ్చునో లేదో?

ఇందు—నీవే నాకు పరమబంధువువని ఎంచుతూ న్నాను. తింటూఉంటే పలబారినట్లూ, నవ్వుతూఉంటే ఊపిరందనట్లూ, నడుస్తూంటే బొంగిల్లపడినట్లు - నానోట మాట రాకుండా ఉంది. తగినవాడిని చూసిపెట్టు- నా ప్రాణాలు నీచేతిలో పెట్టినాను- ఇక నీదే భారము. నీకు నచ్చితే నాకు నచ్చినట్లే, నీమాట కాదనను...(పోవును)

సరో—అయింది, పంజరములో పిట్ట గొలుసు తెంచు కుంది- నాదేమి నేరము? నేను ఆ ఊసు తలపెట్టకుండానే ఆమె బయటపడ్డది. ఇక నేను ఋణము వేస్తే అగ్ని రగిలి తీరుతుంది. నేను చేసేది చెడ్డపని కాదు- కక్కుర్తిపడి కాని పనులుచేసిన కన్న గౌరవముగా బ్రతికేదారి చూపినాను. దాని నుదుటివ్రాత ఏలాగుంటే ఆలాగు జరుగుతుంది.

(వెళ్ళును)



## —। ఆరో రంగము ।—

పాత్రునింట్లో పాత్రుడు.

పాత్రు—నేను వీళ్ళని పోషించడ మేలాగు? మునుపు ఒక్కడినే ఉండేవాడిని గనుక అప్పో సప్పో చేసి తంటాలు పడేవాడిని. ఇప్పుడో—With so many mouths to feed! by Jupiter,—they are quite a legion—ఏమి చెయ్యవలెనో తోచకుండా ఉంది. ఎంతో దూరము నుంచి ఒకపాత encumbrance వచ్చి నెత్తిమీాద పడ్డది, పెళ్ళాడిన పెళ్ళాము, తగిలివేస్తే దాటిపోయేది కాదు, అందు పైని పిల్లలు- అసలుమీాగనడ్డీ లాగు ప్రతి సంవత్సరమూా పెరిగిపోయినారు; కడుపున పుట్టినవాళ్లు, కాటిని పెట్టలేను- ఇప్పుడీ wife ను ఏమి చేయవలెనో చెప్పే మహాత్ము డేడీ? ఉమాకాంతము కొండరాడవాళ్లకి చదువు చెప్ప డానికి European Mistress కావలెనని చెప్పినాడు. ఇ దా పనిచేయగల్గితే నెలకి నూరురూపాయిలు ఇవ్వడాని కొప్పుకొన్నాడు By Jingo, that is a good idea. రెబెకా ఇందు కొప్పుకోదా? అడిగితే తెలుస్తుంది. Rebecca, my dear, my love—

రెబె—What for?

పాత్రు—నేనొక plan వేసినాను, ఏమని చెప్పుదును! మనపిల్లలు చావడానికి సిద్ధముగా నున్నారు.

రెబె—ఏమి ?

పాత్రు—తిండిలేక మాడి. They are actually starving.

రెబె—What am I to do ?

పాత్రు—You can save them తలపని తలంపుగా మంచి తరుణము తారసిల్లింది.

రెబె—How is that ?

పాత్రు—మనపొట్ట గడవడాని కొక సూత్రము కని పెట్టినాను.

రెబె—What is that ?

పాత్రు—నీవు Mistress కావాలి.

రెబె—Mistress ? ఎవరికి ? Never !

పాత్రు—ఆ Mistress కాదు, Master-Mistress అంటారే, ఆ Mistress. ఇప్పుడీఊళ్లో నవనాగరికులు కొందరు బయలుదేరినారు, వాళ్ళు తమ పెళ్ళాలకి ఇంగ్లీషు చెప్పించవలెనని అనుకొంటున్నారు. నీవు వాళ్ళకి Mistress వి కావలెను.

రెబె—No, I won't.

పాత్రు—Indeed, you will, my dear.

రెబె—What will you do ?

పాత్రు—తింటాను.

రెబె—What ?

పాత్రు—I will only eat; I will eat to please you, dear.

రెబె—Never!

పాత్రు—Always your obedient servant గంగారాముపాత్రో.

రెబె—I shall be hanged if I do.

పాత్రు—I shall be blown if you don't. ఇటు విను dear! ఈవిషయములో Full Bench decision ఉంది.

రెబె—ఏమని ?

పాత్రు— Phillip's Concordance of Criminal cases లో ఏమున్నాదంటే "Husband is wife's property" అంటే పెనిమిటి భార్యసొత్తన్నమాట.

రెబె—అయితే ఏమంటావు ?

పాత్రు—నీవే సంసారము నడపాలి.

రెబె—నీవు కూర్చుండి తింటావా ?

పాత్రు—With great pleasure, Ever your most affectionate husband.

రెబె—Really!

పాత్రు— My dear, ఇటువిను. I've always held along with my friends that you are an angel. నానమ్మకము కూడా అదే. నీకు రెక్కలే తక్కువ.

రెబె—నీమాట నిజమేనా ?

పాత్రు—By all the gods in Heaven, though to tell the truth, I am an atheist.

రెబె—Very well. But it is no use, నీవు తాగి అంతా ఎగురగొట్టుతా వేమో?

పాత్రు—That is certain, కాని you will go to Heaven.

రెబె—స్వర్గానికా?

పాత్రు—ముమ్మాటికి. సందేహమా? Angels స్వర్గానికి కాకుంటే నరకానికి పోతారా? What a figure! What a complexion!

రెబె—ఏమంటావు?

పాత్రు—O! ho! dazzling.

రెబె—నిజముగా?

పాత్రు—నిజమా! You have pierced a dagger in my heart.

రెబె—ఎప్పుడు?

పాత్రు—ఎప్పుడా? ఇప్పుడు. కత్తంటే Rodgers గాని మరొకటా? నీవు అపనమ్మక మనే కత్తిని ఈ heart లో గుచ్చినావు. Macpherson's Law of Mortgage నీవు చదివుంటే నాపై నింత అపనమ్మకము నీకుండక పోను.

రెబె—లేదు. నిన్ను నమ్మకపోను. ఆహా! నా husband మనస్సెంత మెత్తనిది!

పాత్రు—అయితే నీ వొప్పుకొన్నట్టేనా?

రెబె—ఒప్పుకొన్నాను; కాని You must mend your ways— తప్పతాగి అంతా పాడుచెయ్యకు- తెలిసిందా?

పాత్రు—ఆ! అంతా పాడుచేస్తానా?

రెబె—సరే. Darling, నీ plan నాకు సమ్మతమే- అలాగైతే నాపై నీకు ప్రేమ ఉంటుందా?

పాత్రు—ప్రేమా? Well I never! నీపై నాకు ప్రేమ ఉండదా? విన్నంత ప్రేమిస్తున్నంటే words fail me to describe adequately the love I bear you. Immeasurable!

రెబె—మంచిది. నేను పోతాను, వంట కొంచెము తరువాయి ఉన్నది- (పోవును)

పాత్రు—దీనికి నామీద ప్రేమ ఇంకా పోలేదు. ఎందుకు పోతుంది? భగవంతుడు నా కెట్టి అందము పెట్టినాడు! (అద్దము చూచుకొని) హాయి హాయి! అచ్చంగా Apollo-like ఒక్క మీసమే లేదా నీనిని తీసివేతునా? ఇప్పుడే కాదు. పందువెంట్రుక రానీ...(తెర వాలును)






## రెండో అంకము

### మొదటి రంగము

పాత్రుడూ రెబకా

రెబ—నేను unmarried గానే ఉండా మనుకొన్నాను.

పాత్రు—It would have been far preferable; it would have been much better.

రెబె—నిన్ను marry కావడము was an act of great mistake for me—

పాత్రు—In this view of the case, my love, I thoroughly agree.

రెబె—I thoroughly agree—

పాత్రు—I thoroughly agree.

రెబె—It was a great mistake to marry a pieless pauper.

పాత్రు—The more so, my love, when you yourself had no copper.

రెబ—Tremendous sad mistake, my darling, very sad I see.

పాత్రు—In this view of the case, my love, I thoroughly agree.

రెబ—Love లో మొట్టి stage చాలా charming గా ఉంటుంది- whispers, hugs and kisses

పాత్రు—The charm is not so great as soon as you become a Mrs.

రెబ—The case becomes more complicated on the contrary—

పాత్రు—In this view of the case, my love, I thoroughly agree.

రెబ—You may give me a thousand kisses and be mine for ever.

పాత్రు—అంతకన్న something more substantial నానోట్లో పడాలి.

రెబ—You are as wise as Solomon, though not so rich as he.

పాత్రు—In this view of the case, my love, I thoroughly agree.

రెబె—మన marriage వల్ల లాభ మున్నట్లు తోచదే!

పాత్రు—Why annually మన కుటుంబము పెరుగుతున్నదే!

రెబె—ఇందులో difference of opinion there may be,

పాత్రు—Whatever difference of opinion there may be, in this view of the case, my love I thoroughly agree.

రెబె—ఏదైనా ఉపాయము చూడవలెను to make both ends meet.

పాత్రు—They will meet; Extremes always meet.

రెబె—హాస్య మాడుతూన్నా ననుకొంటున్నావు కాని వట్టిమాటలతో కడుపు నిండుతుందా?

పాత్రు—నిజమే. "కల్లావు జల్లితే కార్చిచ్చారునా" అని తెలుగుసామెతే.

రెబె—నా నౌఖరీ వాళ్లు తొలగించినారు. వాళ్లిప్పుడు పెద్దపెద్ద పుస్తకాలు చదువుతూన్నారు. Shakespeare, Milton, Saintsbury, Bradley నాకు కొరకబడవు. నాకు తెలిసినదంతా చెప్పినాను. ఇకేమి సాధనము?

పాత్రు—నీకు సాధనాంతరము తోచకుంటే న న్నేదైనా పని చేయుమంటావు కాబోలు?

రెబె—నీ వేమీ చేయతలచుకో లేదు కాబోలు? You are a man—నే నింతకాలము సంసారము సాగిస్తూంటే. నీవు కాలుమీద కాలు వేసుకొని కూర్చుండ మరిగి గడపదాటకుండా కాలక్షేపము చేస్తూన్నావు. ఎంత కాలమీలాగుజరుగపగలను? I am a woman for a' that.

పాత్రు—ఎప్పుడూ ఈలాగు జరుగవలెననే నా అభిప్రాయము.

రెబె—Shame! Fie upon thee!

పాత్రు—నన్ను పోషించ లేనిదానవు why did you marry me?

రెబె—నేను నిన్ను పోషించవలెనా? O dear, dear, ఆడది మగవాడికి కూర్చోబెట్టి కూడు పెట్టవలెనా?

పాత్రు—మగవాళ్ళకి పని లేనప్పుడు ఆడవాళ్ళు గడించి అన్నము పెట్టవలెను, లేకుంటే నరహత్యాపాపము తగులుతుంది.

రెబె—ఆ ముచ్చట యిన్నాళ్లూ తీరిందిగా? నా చేతనైనంత తెస్తూన్నప్పుడు సంసారము క్లుప్తముగా నడిపి డబ్బు వెనక వేయవలెను కాని, ఎవరైనా నీలాగు తప్పతాగి తగులవేస్తారా?

పాత్రు—నే నలాగు చేయకుంటే నీకు స్వర్గమేలాగు వస్తుంది?...అక్కడికి పోయేటప్పుడు నన్ను నీవెంట తీసుకొని పోతావా?

రెబె—స్వర్గానికా? నేను వెళ్లడ మేలాగు?

పాత్రు—నావంటివానికి కూడూ గుడ్డా పెట్టితే పుణ్యము వస్తుంది, అది నిన్ను స్వర్గానికి తీసుకొనిపోతుంది-

రెబె—Indeed! I don't want it.

పాత్రు—నీకు వెళ్ళక తప్పదు.

రెబె—నే నెప్పుడూ వెళ్ళను. ఈ plea మీద నీ వింట్లో కూర్చుండి హాయిగా మెక్కవా మనుకొంటూ న్నావు- నీ సంగతి తెలిసింది.

పాత్రు—తెలిసిందా? నీ బుద్ధేమిటి! సరే, darling, నీకంతా బోధపడ్డది కావున నే నిక దాచడ మెందుకు? నిజము చెప్పుతూన్నాను, నాకు పనిచేయడమంటే తలనొప్పి-

రెబె—అబద్ధము-It is a lie.

పాత్రు—అది lie కావచ్చును, కాని ఆమాట నీవు నామొను టనడము న్యాయము కాదు- నీకు తెలిసింది కనుక నిజము చెప్పుతాను. To tell you the truth, నాకు practice రావడము లేదు. న న్నేమి చేయుమన్నావు?

రెబె—నీవు చదువవు, ఒకరు చెప్పితే వినవు,practice రమ్మంటే ఏలాగు వస్తుంది? Effort లేకుంటే కార్యమేలాగు ఫలిస్తుంది?

పాత్రు—నా కిటుకు నీకు తెలిసింది- సమూలముగా అవగాహన చేసుకొన్నావు. నేను చెప్పవలసినదే లేదు-

(లోపల—అ య్యగారూ)

ఇదెవరు? ఆడదాని కంఠములా గుంది-(పైకి) My dear నీవు వెళ్ళి వంటపని చూడు-ఎవరో client వచ్చినట్లుంది-(రెబెకా పోవును)

పాత్రు—Boy! cook! Butler! ఎవరొచ్చారో చూడు-ఒకడూ పలకడూ! వాళ్ళదా తప్పు? నౌఖరు ఒక్కడే-వాడే అన్ని పనులూ చేస్తాడు-ఇంటిలో లేడు కాబోలు. ఎవరది? లోనికి రావచ్చు.

(సరోజిని వచ్చును)

(తనలో) ఇదెవర్తె? మనిషి బాగానే ఉంది.

సరో—మీరేనా పాత్రుడుగారు?

పాత్రు—ఔను, నేనే-కాని case ఏమిటో చెప్పకుంటే నా opinion ఇవ్వను. Forgery? perjury? chicanery? Breach of trust? Criminal misappropriation? Culpable homicide? Murder?

సరో—నన్ను చెప్పనియ్యరేమి పాపిరబ్బము? case ఉన్నమాట నిజమే. రేపుసాయంత్రముమీరు మా యజమానురాలింటికి వస్తే కేసు ఆమెనోట స్వయముగానే వినవచ్చును.

పాత్రు—నీ యజమానురా లెవరు?

సరో—స్వర్గస్థుడైన మాధవరావుగారి భార్య.

పాత్రు—Oh! widow? ఐతే will case అవుతుంది. సరే-వారి కెక్కడ.

సరో—ఈ హైరోడ్డు వెంటా ఉత్తరానికి కొంతదూరము వెళ్ళవలెను.

పాత్రు—(నోటుబుక్కులో వ్రాసుకొనును) హైరోడ్డు.

సరో—అక్కడ దేవాలయము కనపిస్తుంది.

పాత్రు—సరే, దేవాలయము.

సరో—దానికి దక్షిణముగా ఒక చెరు వుంది.

పాత్రు—దక్షిణము, చెరువు.

సరో—దానికి తూర్పున లాంతరు స్తంభ ముంటుంది, అక్కడికి కొంతదూరాన కాఫీహోటలుంది; దాని కెదురుగుండా పెద్ద మేడ అగుపడుతుంది-అదే వారిల్లు.

పాత్రు—సరే-ఎన్ని గంటలకి వీలుంటుంది?

సరో—పొద్దు కుంకేసరికి రావచ్చును-కొంచె మాలస్యమైతే చాలా అనుకూలముగా నుంటుంది. ఆమె యింటివద్ద ఉంటారు.

పాత్రు—నా కీరోజున చాలా cases ఉన్నవి, ఊపిరి సలుపదు-రేపు కొంచెము తెరిపి ఉంటుంది.

సరో— నే డామెకూ తీరిక లేదు-చుట్టాలు యింటి నిండా ఉన్నారు-రేపు మధ్యాహ్నము బండిలో అంతా బయలుదేరి పోతారు. అటుతర్వాతనే మిమ్ము రమ్మన్నాను.

పాత్రు—Right ho! ఆలాగే వస్తాను. Widow's case కదూ? వేగమే వస్తాను.

సరో—దయచేయండి-ఇం కొక్క మాట-కోర్టునుంచి తిన్నగా అక్కడికి రాకండి, మీ కాయాసముగా నుంటుం దేమో? ఇంటికి వచ్చి కాస్త సేద తీర్చుకొని నీమాజామా తొడుక్కొని నీటుగా రండి. (నవ్వును)

పాత్రు—దిద్దుకొని తీసుకొని రావడమునకూ case కీ ఏమి సంబంధము?

సరో—గట్టిసంబంధ ముంది-వచ్చినతరువాత మీకే తెలుస్తుంది. (నవ్వి) నాకు సెలవు.

పాత్రు—Many thanks, good bye, madam

(ఆమె పోవును)

Case తత్వము చిత్రముగా నుంది...నీటుగా దిద్దుకొని రమ్మన్నది...Can it be illicit love? అలాగై తే వెతకి వెతకి మంచివాడినే కనిపెట్టింది...ఇదంతా నా beauty ప్రభావమే...ఇది నా ప్రాణాలమీదికి తెస్తూన్నది-చూచినవాళ్ళంతా love చేయడమే కదా? I am quite disgusted with this అందము. (పోవును.)



## —। రెండో రంగము ।—

---

ఇందుమతి పడకగది—ఇందుమతీ సరోజినులు.

ఇందు—సఖీ-అదిగో! అదిగో!

సరో—ఏమి టది?

ఇందు—అపూర్వమోహనమే! ఆ సుందరమూర్తి! ఏ మందము! మీసాలు మన్మథుని విండ్లు; ఆ చెవులు తాజా జిలాబీలు; ఆముక్కు కృష్ణమూర్తిచేతి వేణు; ధ్వని మాత్రము లేదు, అదే తేడా.

సరో—ధ్వని లేకపోవడ మేమి? నిద్దురలో అప్పు డప్పుడు ధ్వనిచేస్తూ ఉంటుంది; అది వేణుగానమువలె చెవి కింపుగా ఉండకపోవుచ్చును. నాదముమాత్ర ముంది.

ఇందు—అతని మాటలు చెవులకి తేనెతేటలు సుమా!

సరో—పెళ్ళికొడుకు నీకు నచ్చినా డన్నమాటే.

ఇందు—నచ్చడమా! ప్రేమ ఏలాంటిదో నీకు తెలి యదు, నచ్చడమే కాదు, అంతకన్న ఎక్కువ-సఖీ-అతనిని చూడగానే నాకాళ్ళు జారినవి, ఇప్పుడు నేను ప్రేమనదిలో మునిగిఉన్నాను. అడుగుకు చేరుతూ పైకి వస్తూ మునిగి తేల్తూన్నా నన్నమాట!- నేను నాలో లేను; నిజంగా నేను లేనట్లే- లే నన్నమాట.

సరో—అదేమిటి ! నాకళ్ళకు కనబడుతూ లేనంటా వేమి !

ఇందు—నీ కేమీ తెలియదు-నీయెదుట నున్నదీ, నీకు కనబడుతూన్నదీ నాశరీరముమాత్రమే; దానిలోపల హృదయమనే పదార్థము ఉంటుంది, నీ వెరుగుదువా ?

సరో—కవులు ఉన్నదనే అంటారు.

ఇందు—అది నాకు లేదు.

సరో—ఎక్కడికి వెళ్ళింది ?

ఇందు—హరించబడినది.

సరో—దొంగతనమే!పోలీసువాళ్లకి రిపోర్టుచేతామా?

ఇందు—నీ కేమీ తెలియదే...నామాట విను. నా మనస్సుయొక్క స్థితిసబట్టి చూస్తే పాత్రుడుగారిని వెంటనే పెళ్ళాడి తీరవలెను, అతి జరుగురు, ఆలస్యమైతే విషమిస్తుందేమో ?

సరో—అలా గతనితో స్పష్టముగా నీవు చెప్పి యుండవలసింది.

ఇందు—స్పష్టముగా చెప్పితే కవిత్వము కాదే !

సరో—కవిత్వము లేకుంటే పీడపోయె, కార్యము నెరవేరి యుండునే. ఇప్పు డేమంటే ఏమి లాభము?

ఇందు—నీవు నా ప్రియునిదగ్గరికి పోయి "మిత్రమా! ఇంకేమి చెప్పగలనని" చెప్పి రావే. నామనస్సు స్థిమితపడుతుంది.

సరో—నే నేమీ చెప్పలేను. ఉత్తర మిస్తే యిచ్చి వేస్తాను.

ఇందు—ఉత్తరమా? ఔను-నా కది తట్టలేదు. ఏమి చేయవలెనో తోచనే లేదు. సిధర్నాన చెప్పినావు. వ్రాయనా?

సరో—నీ కెలాగు తెలుస్తుంది? ముక్కుపచ్చలారని ముద్దరాలవు. లోపలికి పోయి ఉత్తరము వ్రాయి; నేనూ సిద్ధంగా నుంటాను...అయ్యో బాబో!...నాపెళ్ళి కే తంటాలూ పడలేదు కాని నీపెళ్ళి కూర్చుడములో నా నరములు తెగుతూన్నవి. వెళ్ళు, వెళ్ళు.

ఇందు—ఉండుండు - కొంచెము కవిత్వము చెప్పతాను-పాత్రుడా! పాత్రుడా! ఆహా! ఎంత తియ్యని పేరు! ఆ వేషమో! బాలకృష్ణుడే, నవనీతచోరుడే! ఏమీ తక్కువ లేదు. ఆ కంఠధ్వని—అచ్చముగా వీణానాదమే. ముక్కు భువనమోహనము. ఓహో! పాత్రుడా! నీ వేషమింపు, నీపేరు సొంపు, శారీరము మనోహరము, అన్నిటి కన్న ముక్కు సర్వహరము. హాయిహాయి!

సరో—ఈమె మతి పోయింది, పిచ్చెత్తినట్లున్నది... నాకూ ఇంచుమించుగా అలాగే ఉంది. ఇదే కాబోలు వలపు పొలవు-అతనికి మాత్రము మతి స్థిమితముగా నుంటుందా? అతడూ మనుష్యుడే. కనుక ఈమెరొట్టె నేతిలోపడ్డది-నావల పుకాడు జడభరతుడు, వ్యర్థుడు, వట్టిమొద్దు, శుద్ధపశువు, అడవిమృగము; అయినా నాగ్రహచార మేమోకాని నామన

స్తతనిపైకే పోతూన్నది-ఇందుచేతనే వలపుగుడ్డిదంటారు... ఇందుమతికి పెళ్ళి కాగానే నాపెళ్ళి...మాయిద్దరి అదృష్ట మేలాగుందో తెలియదు....(పోవును)

---

## —| మూడో రంగము |—

---

ఉమాకాంత మిల్లు—భార్యాభర్తలు.

ఉమా—ఇదిగో విను—ఇరుగుపొరుగువాళ్ళు మనని వెలివెయ్యడానికి నిశ్చయించినారట. పెళ్ళియీడు వచ్చింది పిల్లకి, ఇక పెళ్ళిచేయకుంటే మన ఆబోరు దక్కదు.

సువే—దాని ఘోష మీ కెందుకు ?

ఉమా—చేయక తీరదంటావా ? లేదా ?

సువే—మనము చెయ్యకపోతే అదే చేసుకొంటుంది...ఉక్కగా ఉంది, కొంచము విసరండి... ఊపిరి సలుపలేదు (న్యూస్ పేపరు తీయును)

ఉమా—అది చేసుకోకుంటే ?

సువే—పోనీ-ఆ రుమా లివ్వండి ఈలాగు.

ఉమా—చేసుకొంటుందో లేదో తెలియాలి.

సువే—అసలే చేసుకో నంటూన్నది-తలుపు వెయ్యండి, వేడి draught వస్తూంది. శ్శ...అబ్బబ్బా!

ఉమా—(వేసి) పెళ్లాడక ఏమి చేస్తుంది ?

సువే—ఉద్యోగము...ఆకుర్చీ దగ్గిరగా లాగండి, కాళ్ళు పెట్టుకోవాలి.

ఉమా—ఉద్యోగము చేస్తుందా ఆడది ?

సువే—అందులో ఆశ్చర్య మేమి ? చదువుకొన్నందుకు సార్థక మేమి ? ఆడవాళ్ళుద్యోగము చేయకుంటే ఘోషా ఆసుపత్రు లెలాగు అభివృద్ధి చెందుతవి ? గరల్స్ స్కూళ్లెలాగు సాగుతవి ? మన దేశము బాగుపడడ మేలాగు?

ఉమా—చదువుకొన్నవాళ్లుద్యోగమే చేయవలెనా?

సువే—ఔను-మనపిల్లని టెలిగ్రాఫ్ డిపార్టుమెంటులోనో మెడికల్‌లోనో ప్రవేశపెట్టుదా మనుకొంటున్నాను-ఉద్యోగము దాని కిష్టము లేకపోతే మీ ఘరణ ఉంది కదా? హాయిగా యింట్లో కుడిచి కూర్చుంటుంది-జోడుతాడు జారి పోయినట్లుంది-గట్టిగా కట్టలేదా ఏమి ?

ఉమా—(కట్టి) మీ యిద్దరిడూహ నాకు నచ్చలేదు-

సువే—Pooh! మీ యిష్ట మేమిటి? మీ పెద్దరిక మెవ రొప్పుకొంటారు?...వీధులోకి వెళ్లుతారా ? ఇంట్లోనే ఉంటారా? ఎందు కీ వ్యర్థప్రశంస ?

ఉమా—వెళ్లవలెననే ఉంది-వెళ్ళనా వద్దా ?

సువే—వెళ్ళొచ్చు కాని పొద్దు కుంకేసరికి రావలెను, నా నవల కొంత dictate చెయ్యవలెను, ఉండిపోయింది-

ఉమా—పగలంతా కచేరిలో తెగవ్రాసి వేళ్లు నొప్పి పెట్టినవి-రేపు ఆదివారము కనుక వ్రాయవచ్చును-

సువే.—మీకు laziness బలుస్తూంది-నవల పూర్తి కావచ్చింది, నాయికానాయకులు దూరాన ఉండిపోయినారు-వాళ్ళిద్దరినీ ఒకదగ్గర చేర్చడము కష్టముగానుంది-నాయకిని చంపుతే tragedy అవుతుంది; నాయకుడుచస్తే comedy అవుతుంది; ఏమి చేయడానికీ తోచకుండా ఉంది...Novel మొత్తమ్మీద ఏలాగుందంటారు ?

ఉమా.—చాలా చక్కగా నుంది, కాని నాకేమీ బోధపడలేదు.

సువే.—మట్టితలకాయ! అదిగో పిల్ల ఏడుస్తూన్నట్లుంది, వెళ్ళి పాలుపోయండి. Idiot! నిన్న అమాంతముగా పిల్లని చంపివేసియుందురు-ఇన్నాళ్లయింది పాలు పోయడమే తెలిసిందికాదు - ఎనిమిదేళ్ళ ఆడపిల్ల ఎంతో చక్కగా పోస్తుంది-అంతపాటి తెలివితేటలు లేవు-మగవాళ్ళట, మగ వాళ్ళు! ఈపాటి తెలిసింది కాదు.

ఉమా.—ఏమి చేయుమన్నావే, నాకిది ఎవ్వరూ చెప్పలేదే-

సువే.—ఈ తెలివితక్కువమాట లెవరు నేర్పినారు? ఓటికుండలాగు వాగడము చేతనౌను-నేను షికారు వెళ్లవలెను. పిల్ల రోజురోజుకీ చిక్కుతూంది, మీరు బలిసిపోతూన్నారు-

ఉమా.—కేవలమూ నీకృప, నాయత్నము లేదు.



రామ—ఇంటిలో కొన్ని పనులు చేయడానికి మేమూ, ఇంక కొన్ని చేయడానికి మీరూ అని భగవద్విలాసము, ఇద్దరమూ సృష్టిలో కావలసిన వాళ్ళమే-

సుకే—భగవంతుడు నియమించిన భేదమే కాక మీరు మరికొంత కొత్త భేదము కల్పించి మమ్మల్ని దిగతొక్కి ఇళ్ళలో కైదుచేసి మీరు విచ్చలవిడిగా తిరుగుతూ మేమే ప్రయోజకులమని విర్రవీగుతూన్నారు - మీలాగే మాకూ స్వేచ్ఛ యిస్తే మీపప్పుడకదు.

రామ—ఇదొక భ్రమ- విచ్చలవిడిగా మేము తిరిగి నందువల్ల మాకు వచ్చిన లాభము చెప్పనా ? పదిమందితో కలియడము, వాళ్లతో అక్కరకుమాలిన సంబంధములు కలుగజేసుకోవడమూ, వాళ్ల దుర్గుణము లలవాటు చేసుకోవడమూ మాకబ్బుతవి. ఇంటివద్ద మీలాగే మేముంటే ఖర్చు తక్కువ, పూచీ తక్కువ, గౌరవము హెచ్చు. ఇంకో విశేష ముంది. మేము పదిచోట్ల తిరిగివచ్చినా ప్రతివిషయము లోనూ మీ మాట కెదురాడలేము కదా- చిన్నతనములో చీటికీ మాటికీ చిర్రూబుర్రూ అనే మగడు, అత్తగారూ, తక్కినవాళ్లున్నూ కొంతకాల మయ్యేసరికి మీకు లొంగి పోతారు. మీచేయి కింద పురుషులచేయి మీదు అనడమే కాని అన్నివిషయములా మీమాటే నెగ్గుతుంది. మాకేమో సర్వాధికార మున్నదని పేరేకాని నికరానికి చూస్తే మీకు దాసులవలెనే మెలగుతాము- మీశక్తి చాపకింద నీరులాగు

సర్వతా కనబడకుండా ప్రసరిస్తుంది. మాశక్తి మొదట పెరిగినట్లుండి తుదకి తగ్గుతుంది. గృహస్థాశ్రమము దిదొక సర్వతోముఖమైన ధర్మము. మీరు పేరుకి పరతంత్రులు పనికి స్వతంత్రులు; మేమో పేరుకి స్వతంత్రులము, పనికి పరతంత్రులము. వివేకమున్నవారిమాట మీదు, మూర్ఖుల మాట కిందు; ఇందు వయస్సు, లింగమూ గణింపబడవు: అన్ని కుటుంబాలలోనూఇలాగే సంభవిస్తూంది.

సుకే.—కార్యసాధన మందు మీరు చాలా గడుసు వాళ్ళు, మమ్ము బెల్లించి ఏలాగో మీమాట సాధించుకొంటారు.

రామ.—అయ్యోబాబో! మీమాట నెగ్గకపోతే చీడ పురుగులాగు పొగలూ రాత్రీ నమ్మ కొరికి చంపరా? అదే దెప్పడము, అదే మూతివిరుపులు, అడుగడుగుకీ తట్టాబుట్టా మామీద పారవేస్తారు. మీమాటచొప్పున నడువక మే మేచెరువునీళ్ళు తాగగలము?

సుకే.—అదే నిజమైతే మనకిద్దరికీ తగాదా లేకనే పోవును. గృహస్థు అన్నవాడు సంసారము నడుపుకోవలెనా వద్దా? అప్పో సప్పో చేసి అన్నిఖర్చులూ పెట్టుకోవలెనా? మీ రాలాగు చెయ్యక నేను గడించుకొన్న నాలుగురాళ్ళూ ఇమ్మంటున్నారే?

రామ.—ఆయముకన్న వ్యయము హెచ్చినప్పు డేమి చేయుమన్నావు? ప్రతీనెలకూ అప్పు చేస్తూంటే తీర్చడ మేలాగు? జీతము రాళ్ళు తప్ప పైనొకపైసా వచ్చే సాధ

నము లేదు- ఖర్చు జీతమును మీరిపోతూన్నది- నేను గృహస్థుడ, నీవు గృహిణివి కావా? సంసారము సాగించే పూచీ నీకు మాత్రము లేదా? ఇద్దరమూ సంసారశకటమునకు చక్రముల వంటివాళ్ళమేనా? రెండుచక్రాలూ నడుస్తేనే కాని బండి కదులుతుందా?

సుకే.—స్త్రీవిత్తము నాశిస్తూన్నారా? ఇదా మీపౌరుషము? తక్కువజీతము గల పని చేయడ మేమి? హెచ్చు సొమ్ము వచ్చేదే చేయకూడదా?...ఇన్నిమాట లెందుకు? నాసొమ్ము మీ కివ్వను- సంసారము నడుపుతే నడపండి, లేకుంటే మానుకోండి, అందరమూ పస్తుందాము.

రామ.—అంతకన్న నాకు సన్న్యాస మిప్పిస్తే నీకు నయము- పస్తుండడము మనకు చేతనౌతుంది కాని, ఈ పిల్లలో?

సుకే.—ఒక రిప్పించడ మేమి? మీరే పుచ్చుకోండి- పెళ్ళాముమీద కోపమువచ్చి ఎందరు సన్న్యాసులు కాలేదు? అందులో మీరొకరు.

రామ.—ఇదే కదా నీకు నాపై అభిమానము? చదువు చెప్పించినందుకు చక్కగా బుద్ధిచెప్పినావులే. ఈపిల్లలు నీపిల్లలైతే పస్తు పడుకోబెట్టుతావా? పట్టుదలే ప్రధానముగా చూసుకొన్నావు కాని భర్తకి భార్యా చేదోడువాదోడుగా వుండి కుటుంబయాత్ర సాగించవలెనని ఎరుగవా? పస్తు పెట్టమన్నావాపిల్లలని? సన్న్యాసము పుచ్చుకో మన్నావా నన్ను?

ఇంతగర్వము నీ కుండదగునా?...నిన్నన్న పనిలేదు- స్వయం కృతాపరాధానికి తగినశాస్తి చేసినావు లే...నీమనసుకి నచ్చినట్లు నేను జరుపుతే ఊరకుంటావు, లేకుంటే ఎదురు తిరుగుతావా ? అందరూ చావగా మిగిలిన బిడ్డ లిద్దరే గా? వాళ్ళని చూడలేవా ?

సుకే—సవతితల్లిని కనుక మీరేమన్నా ఎవరైనా నమ్ముతారు-డబ్బు తెచ్చినన్నాళ్ళూ అంతా ఖర్చు చేస్తూంటే మీరు కన్ను మూసినతరువాత నాగతి ఏమి కావలసింది? ఇప్పటి వరకూ గాజుల బేరము భోజనానికి సరిపోతూంది, ఎర్రని ఏగాణీ వెనుక వేసుకోలేదు కదా ? మీపిల్ల లిద్దరూ రెక్కలు వచ్చినవాళ్ళు కనుక వారిదారిని వారెగిరిపోతారు, మిగిలినదాని నొక్కర్తెనే; మీ పేరు చెప్పుకొని నేను నీళ్ళ బిందెలు మోసుకొనో, లేకుంటే ఏవరింటైనా వంటకి కుదురు కొనో జీవనము చేసుకోవలసివస్తుంది. అలాంటిగతి పట్టకుండా ఉండేటందుకు నాడబ్బు వెనుక వేసుకొంటున్నాను. అదిచూస్తే మీకందరికీ కన్నెర్రగా ఉంది. మీస్థితిని మొదట నుండీ చూసినదాన నౌటచేత వెలుగుండగానే వెతకుకొంటున్నాను. నే నెవరికీ నాఘురణ యివ్వను, ఏ బాంకిలోనో వేసుకొంటాను- స్త్రీధనముమీద మీకు హక్కు లేదు- నాజాగ్రత్త నేను పడకపోతే నాగతి ఏమి కాను?

రామ—ఎంత దూరాలోచన చేసినావు! అన్నదమ్ములకీ అక్కచెల్లెళ్ళకీ పంపకా లిప్పుడున్నవి కాని ఇకముందు

భార్యాభర్తలికి పంపకాలు పుట్టుతివి, నవయుగమాహాత్మ్య మీలాగు పరిణమిస్తుంది కాబోలు!

సుకే—డబ్బున్న దగ్గరల్లా ఎప్పుడూ పంపక ముంటుంది, అన్నదమ్ములకే కాదు, అక్కచెల్లెళ్లకే కాదు, అంతటా ఇదే ధర్మము; ధనము లేకపోతే ఏతగాదా లేదు.

రాము—భక్తి, ప్రేమ, అనురాగము, ధర్మము— అనేవి నశించి కేవల ధనమే పరమార్థ మయింది- సనాతన ధర్మము సన్నగిల్లింది, ఆదర్శము లగ్నిదగ్ధము లైనవి- ఇక పూర్వపశ్చిమ దేశముల భేదము నశించింది- ఏమి వింత!

సుకే—మా కళ్ళలో దుమ్ముజల్లి, మ న్నిళ్ళలో పాతిపెట్టి, చదువు చెప్పించక, బుద్ధి వికసింపనీయక నూతిలో కప్పలనుచేసి మూలకు నెట్టి అన్నివిషయములా మీ కను కూలముగా వ్రాసి పెట్టుకొని మా కుగ్గుపాలనాటినుండి దాసీ ధర్మము నేర్పినారు. మేమదే ఉభయతారకమనుకొని భ్రమ పడ్డాము. కాని కన్నుతెరచిచూస్తే మీ పక్షపాతబుద్ధి విశద మయింది, మాకు స్వేచ్ఛప్రసాదిస్తే మీ ఆటలు సాగిరావు. ఈ బానిసతన మెన్నితరములనుంచో అనుభవిస్తూన్నాము, ఇప్పటికి తెలివివచ్చింది, మీకూ మాకూ సమానమైన హక్కులున్నవి. మాకన్న మీరు హెచ్చుకారు, తెలిసిందా? మీతో సరిసమానముగా మే ముండదగినవాళ్ళము; అట్టి హక్కులు మాకిచ్చినట్లయితే మీకూ మాకూ పొసగుతుంది. లేకుంటే ఎవరిదారి వారిదే ..(త్వరగా లేచిపోవును)

రామ—కొండ ముదిరి ఈసరవిల్లి అయింది-ఇదే నాకు ultimatum ఇచ్చింది, అన్నంతపనీ చేసి తీరుతుంది; మిడిమిడిజ్ఞానము కలిగితే ఇదే ప్రమాదము. నేను లేక పోయినా దానిపొట్ట అది పోసుకోగలదనే ధైర్యము చిక్కింది, ఇప్పటి ఆడవాళ్ళు మగవాళ్ళపై నాధారపడడము భుక్తి కొసమే కాని భక్తికోసము కాదు. మగవారియందు ప్రేమచే కాదు, ధనముపై ప్రేమచేత; ధన మార్జించుకొనగలిగిన స్త్రీ లకు భర్త ఆవశ్యకత లేదు; ఏదో వంక పెట్టి అతని కుద్వా సన చెప్పి తీరుతారు. నాగతి యింతకు వచ్చింది. హా! పర మేశ్వరా! ముందేమి చేయదలచినావో కదా?

---

—ఐదో రంగము—

---

సుహాసినీ పూర్ణేందులు.

పూర్ణే—పాడుముండా చదువు ఆచారము లన్నిటినీ పాడుచేసింది. ఆపెద్దమ్మ కేమి చెప్పినావో కాని అది పున స్సంధానాని కొప్పుకో లేదు.

సుహా—అవును. కోతిలాంటివాడిని కట్టిపెడితే దాని కాపుర మెలాగు తగులబడుతుంది? ఒక రోజా రెండు రోజులా, జన్మ మున్నంతకాలమూ జరుగవలసిన సంబంధము కదా? దొండపండువంటి పిల్లని కాకిముక్కుకి కట్టిపెట్టినారు. మొర్రో వద్దని నేను మొత్తుకొన్నాను, అదీ కంటికీ మంటికీ ఏక

ధారగా పెళ్ళైదురోజులూ ఏడ్చింది; చూచినవారంతా మీ నోట్లో గడ్డిపెట్టినారు, ఎంతమంది చెప్పినా మీరు విన్నారా? మీమాటే నిల్పుకొన్నారు కాని-అప్పుడు నోరూవాయీ లేనిపసిపిల్ల, అభమూ శుభమూ ఎరుగనిదికనుక ఊరకుంది, ఇప్పుడు కొంచెము జ్ఞానము వచ్చింది, మంచీ చెడ్డా తెలిసినవి, మూగపశువులాగు ప్రతివిషయమునా మీ మాట చొప్పున నడవడము దానికి నచ్చలేదు-అందుచేత అమ్ముడు మొగాన మొద్దులు పెట్టింది, శని వదల్చుకొన్నది, హాయిగా యిక్కడ ఉండి కాలక్షేపము చేస్తుంది-అందు తప్పేమి?

పూర్ణే—తప్పు లేదంటావా? ఈడువచ్చినపిల్ల పుట్టింటొన్నినా ళ్ళుంటుంది? ఇది మర్యాదేనా? ఎక్కడేనా ఉందా ఈ వైపరీత్యము?

సుహా—మగవా ళ్ళేమి చేసినా మారుమాటాడక గాడిదెలా గన్నింటినీ సహించి మీరే దిక్కని జోహారు సల్పే ఆడవా ళ్ళున్నంతకాల మిది వైపరీత్యమే-మాకూ బుద్ధి ఉన్నది, కష్టమూ సుఖమూ మేమూ అనుభవిస్తూ న్నాము. ఓర్వగలిగినంతకాల మోపిక పట్టినాము. ఇటుపైని మాకు సంబంధించే విషయములలో మా సలహా లేనిదే మీరు వ్యవహరించడముకు వీలులేదు. మమ్మడిగి మాసలహా తీసుకొని మా యిష్టము, లాభనష్టములూ, సుఖదుఃఖములూ విచారించి వ్యవహరిస్తే మీమాటచొప్పున యథావిధిగా నడుస్తాము, లేదా స్వతంత్రించి మా వ్యవహారములు మేమే

చక్కబెట్టుకొంటూ మనే ఆడవాళ్ళు ఉదయిస్తే ఇందు వైప రీత్య మేమీ లేదు. ఏదో కారణముచేత యిష్టములేని భార్యను విడిచిపెట్టడము మగవాళ్లలో లేదా? అది వైపరీత్యము కాదా? ఆడది తన మగని విడిచినంతమాత్రాన వైపరీత్య మవుతుందా? ఒక భార్యమీద ఏదో నేరముమోపి రెండో దానిని చేసుకోవడము మనము చూడలేదా? అలాగు స్త్రీ లేల చెయ్యకూడదు? మీరూ మేమూ భగవంతుని దృష్టికి సమానులమే కదా? సరిస మానులలో తారతమ్యము పుట్ట డానికి హేతువేమి?

పూర్ణే—మీ వాదముచూస్తే సనాతనధర్మ మంతా తారుమారు చేసేట ట్లున్నదే? సంఘ విప్లవముసంభవించే ట ట్టుంది.

సుహా—విప్లవ మనకండి, సంస్కరణ మనండి. లోప ములు సవరించుకోవడము సహజధర్మ మవునా కాదా? స్త్రీ పురుషుల కింత వ్యత్యాస ముండడమువల్ల స్త్రీలకు చాలా నష్టముగా నుంది, కావున సంస్కరణ మత్యావశ్యకము. ఇత ర దేశముల దిక్కు కన్ను తెరచి చూడండి—అమెరికా, ఫ్రాన్సు, ఇంగ్లండు, చీనా, జపాను దేశములలోని స్త్రీ లింత అధోగతిని పడలేదు. వారందరూ కాలానుగుణముగా ఆచార వ్యవహారములు మార్చుకొన్నారు. అందుచేతనే ఆదేశము లన్నివిషయములా అభివృద్ధిని చెందినవి. భరతఖండము మాత్రము పూర్వాచారమే పరమధర్మమని సంస్కరణమును

మానుకొన్నది. ఎన్నడో వ్రాసిన శృతులు, స్మృతులూ ప్రమాణములుగా నున్నవి. తరువాత వారెవ్వరూ వాటిని సంస్కరించలేదు, రానురాను అవి శిలారూపము దాల్చినవి. ఇప్పు డేదైనా సంస్కరింప మొదలుపెట్టితే మీ రందరూ గోలుమని రవ్వపెట్టి, మార్పు మా కొద్దు, మాఋషులు శాశ్వతములయిన విధు లేర్పరచినారు-అవి మాకు సర్వ శ్రేయోదాయకములు, వాటిని మార్చ నవసరము లేదని ముద్ర పెట్టుతారు-అందుచేత కనుబొమ్మ మీది వెండ్రుకల వలె ఎదుగూబొదుగూ లేక మనసంఘము ఒక్కరీతినే ఉన్నది...ఇప్పు డిప్పుడు ఉత్తరహిందూస్థాన మందలివారు కొంతమార్పు చేసుకొన్నారు కనుక బాగుపడ్డారు-దాక్షి ణాత్యులు మాత్రము మంచీచెడ్డా ఆలోచించక పూర్వాచార ములు పట్టుకొనే వేలాడుతూన్నారు. మాడుసురు తగిలి ఈ యాచారములు మట్టిలో ఎప్పుడు కలుస్తవో అప్పుడు మన సంఘానికి మంచిదినములు వస్తవి-కూతురు పుట్టగానే గోలు మను ఏడ్పు పోతుంది.

పూర్ణ్ణే—బాగుంది-మీరంతా సంఘసంస్కర్తలు కాబోతారు కాబోలు! చెయ్యండి కొత్తతీర్పులూ! తగిన మార్పులున్నా-

సుహా—ఏదీ చేతకాక మీరు చేతులు నులుపుకొని కూర్చుంటే మేము నడుముకట్టక తీరుతుందా? మీ కేమి పోయింది? హాయిగా అధికారము చలాయిస్తూన్నారు. మా

మీాద సవారి చేస్తూన్నారు-మా సుఖమంతా మీా నెదాన పెట్టి మీా కష్టము మే మనుభవిస్తూన్నాము, మీారు హాయిగా సుఖపడుతూన్నారు-కావలసినంత స్వేచ్ఛ, కాదనేవాళ్ళు లేరు. మే మేమైనా అంటే మమ్మ చావచంపుతారు-దేహ బలమొకటి ప్రసాదించినాడుగా పాడు దైవము, మా మీాద దానిని వినియోగిస్తూన్నారు. ఇంకెన్నాళ్ళో సాగవు లెండి మీాఆటలు-మావాళ్ళంతా కన్ను తెరచే సరికి మీాభోగము బొగ్గుపా లవుతుంది. మీా ఆధిక్య మును గంటుతుంది.

పూర్ణే—(తనలో) శృతి మించుతూన్నది, ఇక నీప్రస్తా పన ఆపడమే శ్రేయము...(పోవును)

సుహా—శృంగభంగ మయింది. మొగము వాచినట్లు పెట్టినాను చీవాట్లు...(పోవును)

---

## —। ఆరో రంగము ।—

---

### ఉమాకాంత మిల్లు—భార్యాభర్తలు.

ఉమా—నేడు బండీ ముందుగా పంపడానికి వీలుం డదు, పని తొందరగా ఉంది, అది ముగినేసరికి చీకటి పడు తుంది. కాలినడకను అప్పుడు రావలెనంటే కష్టముగా నుంటుంది.

సువే—ఈరోజు నాకు బండీ తప్పకుండా కావాలి, నేను వచ్చేటప్పటికికూడా చీకటి పడుతుంది.

ఉమా—ఏమి టా రాచకార్యము ?

సువే—రాచకార్యాలు మీకే కాని మా కెక్కడివి? రామారావుగారింట చిన్న Entertainment ఉంది. ఐదు గంటలకి మొదలు, ఎనిమిది కావచ్చును పూర్తి అయ్యే టప్పటికి.

ఉమా—పిల్లలమాట ?

సువే—మీా రుంటారు.

ఉమా—నాకు తెరపి లేదంటేనే. తలమున్కలౌన్న నాకు స్వేచ్ఛ ఎక్కడిది ? ఈ వేళ treasury account పోవాలి_urgent. నే నుండక వల్లకాదు. ఏమి దారి ?

సువే—సెలవుచీటి వ్రాయండి.

ఉమా—అమ్మయ్యో! సెల విస్తారా ? డిప్యూటి కలక్టరు అమాంతముగా గొంతుక కొరుకుతాడు.

సువే—జబ్బని వ్రాయండి- తలనొప్పో, జ్వరమో, వాంతులో అనివ్రాస్తే సెలవిచ్చి తీరాలి, చచ్చి తీరాలి.

ఉమా—చచ్చేటందుకు కొకరి సెల పక్కరలేదు- ఇప్పటిదాకా గట్టిగా నున్నానని ఎరుగును. ఇప్పుడే కచేరి నుంచి వచ్చినానుకదా, జ్వరమంటే నమ్ముతాడా ?

సువే—నాకెందుకా ఘోష- బండీ కావలె- నాతో సమ మరికొందరు కాచుకొని ఉంటారు, వాళ్ళతో బండీ మీాద వస్తానని చెప్పినాను, వెళ్ళకుంటే వేళాకోళము చేస్తారు;

అసలే నేను బడాయికోరునని ప్రతీతి, దానికితోడు నేడు బండి లేకపోతే నాకు పీకపోయినట్లుంటుంది.

ఉమా—పోనీ, నడిచే వస్తాను- పిల్లల మాటో ?

సువే—దాసీ దాడిస్తూంటుంది. ఆకలయితే పాలు పోస్తుంది- ఇంతలో మీరు వస్తారుగా ? అన్నము తినిపించండి.

ఉమా—అంతదాకా వాళ్ళేడుస్తూండవలసిందే ? చంటిపిల్లని కూడ వదలి చక్కాబోతావా నీవు ?

సువే—ఒక్క గంటేగా ? మీరేదుగంటలికి రానే వస్తారు-అలమరలో పాలున్నవి, Stove ఉన్నది-కాస్త వెచ్చబెట్టి పాలుపోస్తే ఆకలి తీరుతుంది, లేదా Horlicks పోయండి.

ఉమా—పిల్లలేమైనా సరే, మగడేమైనా సరే నీకు Engagements తప్పవా ?

సువే— మేమేమయినా మీరు కచేరికి వెళ్ళడము మానినారా ? పగలంతా నాపాట్లు నేను పడ్డాను కాని మీరేమైనా తోడు పడ్డారా ? ఈడూరి కాడూ రెంతో ఆడూరి కీడూ రంతే.

ఉమా—నాకచేరికీ నీ tea party కిన్నీ సాటితెచ్చినావా ?

సువే—రెండూ అవసరమైన పనులే-

ఉమా—సరేకాని రామారావుగారికి వెలి కదా వారింట నీవు విందారగించబోతావా ?

సువే.__ఏందుకూ వెలి?

ఉమా.__అతనిభార్య వితంతువట- తగినన్ని నిద ర్శనాలు చూపించి పెద్దలంతా వాళ్ళని వెలి వేసినారు కదా వారింటికి మనము వెళ్ళవచ్చునా?

సువే.__అన్నీ అబద్ధాలు. వైదిక బ్రాహ్మణులకు లంచాలు (సంభావనలు) సరిగా ఇవ్వలేదని వాళ్ళీ పుకారు పుట్టించినారు కాని ఇందు సత్యమేమీ లేదు. వారింటి కందరూ వచ్చిపోతూన్నారు; వెలీ లేదు గిలీ లేదు.

ఉమా.__ఏమో, వారింటికి వెళ్ళడము నాకు సమ్మ తము కాదు.

సువే.__ఆలాగైతే మీరు రాకండి-పెద్దమనిషి పేరం టానికి రమ్మంటే పిరికివాళ్ళ మాటలు విని నేను వెళ్ళకపోవడ మేమి పెద్దమనిషితరహా? నేను వెళ్ళడము మానను.

(సుకేశినీ రామచంద్రులు వత్తురు)

సుకే.__చూచినావా, సువేషిణీ!

రామ.__ఉమాకాంతమూ, చూడుచూడు.

ఉమా.__ఏమి టేమిటి?

సువే.__ఏమిటి కథ?

రామ.__రామారావుగారింటికి వెళ్ళవద్దని నా పట్టు.

సుకే.__నే నాయనమాట వినకతప్పదా?

రామ.__నామాట వినిపించుకోవలెనా? వద్దా?

సువే—మాటేదో చెప్పండి; మీ reasons విన్న తర్వాత మా అభిప్రాయము చెప్పుతాము.

రామ—రామారావుగారికి వెలి, వాళ్ళింట్లో నీళ్ళు కూడా పుచ్చుకో కూడదు, అందుచేత tea party కి దీనిని వారింటికి వెళ్ళవద్దన్నాను.

సువే—సరే, మీ అభిప్రాయమది. ఆమెఅభిప్రాయ మేమి?

సుకే—వెలీలేదు గిలీలేదు, సార్వాబద్ధము- అదీకాక వారింట భోజనము చెయ్యకూడదు కాని తదితరమున కాటంకము లేదు. కనుక tea party కి వెళ్ళవచ్చునని నా అభిప్రాయము.

రామ—(సుకే॥తో) నా అభిప్రాయ మిది మన్నించ నక్కరలేదా, ఏమి ఉమాకాంతమూ ఊరకున్నావు?

ఉమా—నిజమే.

సుకే—మీరు వేరు, నేను వేరూ, ఎవరి అభిప్రాయము వారిది. మీరు తింటే నాకడుపు నిండుతుందా? ఏమే సువేషీ?

సువే—Quite so.

రామ—అయితే వెళ్ళు, మంచి మాటే; నా కిష్టము వచ్చిన చోటికి నేనూ వెళ్ళుతాను. ఏమి కాంతమూ?

ఉమా—బాగుంది-

సుకే—మీరూ నేనూ సమానమే?

రామ—ఇద్దరమూ వేరంటివిగా? నీమాటచొప్పున నీవు నడువు, నాకు తోచినట్టు నేనూ చేస్తాను.

సుకే—అలాగైతే మీరు చాలా disobedient husband అన్నమాట ?

రామ—నీవు చాలా obedient wife అన్నమాట కాబోలు ?

(సుహాసిని వచ్చును)

సుహా—ఇక్కడా ఉన్నావు సుకేశీ? మీయింటిదగ్గిర నుండి వస్తూన్నాను. ఈయనా ఇక్కడే ఉన్నారా?

రామ—ఆహా-ఎందుకూ ?

సుకే—ఏమి కాంతంగా కూరకున్నారు?

ఉమా—ఏ మనగలము మీ వ్యవహారాలు చూసి ?

సుహా—సువేషీ, సుకేశీ, లెండి. ఇప్పటికే చాలా late అయింది-నా husband ఇంట్లో నున్నారు. నే నిక్కడికి గావడమే ఆయనకి గిట్టదు. ఏవో కొన్ని మాటలాడి నచ్చచెప్పి నిద్రపుచ్చి ఇలాగు వచ్చినాను.

ఉమా—మంచిపని చేసినావు.

(రోజుతూ పూర్ణేంద్రుడు వచ్చును)

పూర్ణే—నా wife ఇలాగు వచ్చిందా ?

సువే—ఇక్కడుంది, ఎక్కడికీ పారిపోలేదు.

సుహా—ఇంతలోనే ఏమి పుట్టి మునిగింది?రవ్వంతైనా decency వద్దా ? Ill-bred folk ! Dunces!

(సూర్యనారాయణ సుభాషిణి వత్తురు)

సూర్య—నీ వక్కడికి వెళ్ళవల్లకాదు-

సుభా—నేను వెళ్ళక మానను మీ రేమన్నా సరే.

సూర్య—వెళ్ళవద్దు.

సుభా—చాలు, ఊరకుండండి, పెద్దమనుష్యులున్నారు.

ఉమా—ఏమిటి మీ వాదకారణము?

సూర్య—రామారావుగారింట tea party కి వెళ్ళనియ్యనుదీనిని-

సుభా—నేను వెళ్ళక మాన నన్నాను.

సూర్య—ఏలాగు వెళ్ళుతావో చూస్తాను-

సుభా—ఏలా గాపుతారో చూస్తాను-

అందరు—మేమంతా ఏకగ్రీవముగా వెళ్ళవద్దని చెప్పుతూంటే ఎందుకూ మీ కీహఠము? మామాట వినకూడదని మీ కీ మూర్ఖపు పట్టేమి?

ఆడవాళ్ళు—Get away. మేము వస్తామని promise చేసినాము, వెళ్లక తప్పము. (మగవాళ్ళని తోసి పోవుదురు)

ఉమా—అంతల్లా ఇం తయింది; వ్యవహారము రోజూ ముదిరిపోతూన్నది.

రామ—సందేహము లేదు-వాళ్ళ కిష్టమున్న చోటికి వెళ్లుతూన్నారు-మనమాట తోసివేసినారు-గడ్డిపోచకన్నా

కనీసము చేసినారు మనపూట, గౌరవము రవ్వంతైనా లేదు-ఇదే మనము చేస్తే మహాపరాధమని పెద్దగోల చేస్తారు.

పూర్ణే—వీళ్ళు సోలెడుబియ్యం ముశికించి మన నెదాన పోయరు-ఇక నటుకులు తిని కాలక్షేపము చేయ వలసిన దే !

సూర్య—అంతటితో తీరిపోదు- భగవంతు డిచ్చిన చెవులు రెండూ ఉంచరు.

ఉమా—కిందటి శనివారము నే నింటికి రావడము కొంచె మాలస్య మయింది; తొమ్మిదైనా కాలేదు. ఆపాళంగా వంట Column blank, అమ్మగారు మంచముమీద ఒక టంకె వేసినారు.

పూర్ణే—మీపని నయమే. నాసంగతి వినండి. ఆనాడు మాదేవిగారు తలుపే తీయలేదు, వీధి అరుగుమీద రాత్రంతా కాలక్షేపము చేయువలసివచ్చింది-

రామ—ఏపోరూ లేకుండా పండుకున్నావు - అదీ కొంత నయమే. మాఆవిడె నేను రావడము చూసి, "దొంగ దొంగ" అని కేక వేసి కుక్క నుసికొల్పితే పరుగెత్తి పోయి పరాయిచోట చెట్టుకింద పండుకొన్నాను.

ఉమా—(సూర్య॥తో) నీకు జరిగిన మర్యాద ఏలాంటిది ?

సూర్య—చెప్పుకొంటే ఏమి ప్రయోజనము ? నాకథ వింటే నక్కలూ కుక్కలూ ఏడుస్తాయి-

రామ—చెప్పుచెప్పు-అదీ విందాము.

సూర్య—చెప్పింది కేముంది? ఆలస్యంగా ఇంటికి వచ్చినానని అన్నము పెట్టలేదు-కొంచెము బెదిరించినాను, వెంటనే మూలనున్న చీపురు తీసి మూడు దెబ్బలు కొట్టింది, నొప్పి ఇంకా పోలేదు-

ఉమా—ఇంతవర కొచ్చింది, ఇంకెంత వరకూ పోతుందో! ఏమిఁ సాధనము?

సూర్య—క్షమించుమని మొఱ పెట్టుతూనే ఉన్నాను. మానితేనా? మరీ జోరయింది. తలుచుకొంటే ఇప్పుడు తగుల్తూఉన్నట్లుంది.

రామ—వీళ్ళ పెంకెతనము మితిమీరుతూన్నది.

సూర్య—అప్పుడే వెళ్ళి పోలీసువారికి రిపోర్టు చేసినాను.

పూర్ణే—బాగా చేశావు.

సూర్య—ఇంతవరకూ ముదిరిపోయింది, ఇక నేమీ లాభముండ దనుకొంటాను.

పూర్ణే—అయినదాని కేమి? ముం దేమి దారి?

ఉమా—నే నప్పుడే చెప్పినాను, విన్నారుకారు నా మాట; ఇప్పుడు విచారిస్తే నేమి లాభము?

సూర్య—పదండి-అందరమూ కట్టకట్టుకొని Emigrate అవుదాము-వీళ్ళజోలి మనకు వద్దు, మనదారిని మనము పోదాము.

ఉమా—వాళ్ళకి కాదు శిక్ష, మన కవుతుంది. నౌఖరీ వదులుకొని ఎక్కడికి పోగలము? పోతే పొట్టకూడో? వాళ్ల కాళ్ళా వేళ్ళా పడి బ్రతిమాలుకొందాము, ఏలాగో సంధిచేసుకొందాము- వేరేవారి తోకొట్టద్దు-

రామ—నిజమే-తప్పుదారి తొక్కినందుకు తగినశాస్తి అయింది-ఇక బుద్ధి వచ్చింది-

పూర్ణే—సూర్యమూ, ఆడవాళ్ళు చదువుకుంటే అచ్చే దేమిటో తెలిసిందా?

సూర్య—ఇదిగో చెవులు నులుపుకొంటున్నాను-ఇక నెప్పుడూ ఆప్రసంగ మెత్తను. గతకాలము మేలు వచ్చు కాలముకంటెన్. ఇది మహావాక్యము.






# మూడో అంకము

## మొదటి రంగము

పాత్రుని కచేరీగది.

పాత్రు—ముఖ మేమో అందముగా లేదు, ఎంత ప్రయత్నించినా నఖశిఖపర్యంతమూ కనబడలేదు; వయస్సు కూడా హెచ్చుగానే ఉన్నట్లు తోస్తుంది...ఐతే నేమి? బాబో, లక్షరూపాయిల ఆస్తి! మాటలా? నే నొదలను... ఊఁ. practice!...ఎవరికి కావాలి? ఇలాగు కాలుమీద కాలు వేసుకొని కూకుంటాను...నా అందము లక్షరూపాయీలు చేసింది...(అద్దము చూసి) భగవంతుడు అందమొకటి ఇచ్చినాడు! ఏమి చక్కదనము! బలే! ఏమి కన్బొమలు! మీసాలో grand! అన్నిటికంటె ముద్దుగారుతూంది ముక్కు! అచ్చముగా Greecian cut (సరోజిని వచ్చును)

సరో—ఓహో! పాత్రుడుగారు!

పాత్రు—ఎవరది? ప్రియసఖి సరోజినీ, రా రమ్మ you are thrice welcome! ఏమి కబుర్లు?

సరో—మా ఇందుమతికి బొత్తిగా మతి పోయింది.

పాత్రు—Lunar-faced lunatic అయిందా? What is the matter, ఏమి విశేషము? actually mad?

సరో—Mad, fad కాదుకాని quite as bad- నేను కూడా కొంచెము English నేర్చుకొన్నాను లెండి ఈ మధ్య-

పాత్రు—Very good! ఇవి progress రోజులు కదా! మీరు Educate కాకపోతే ఏలాగు? ఇది లేనందు వల్లనే భారతవర్షము పండుకొని ఉంది.... అయితే నీ mistress mad కాదా?

సరో—మీ అందము చూసీ చూడగానే ఆమెకు పిచ్చెత్తింది.

పాత్రు—ఓహో! ఇంతేనా? By Ajax ఇ దబ్బురమా? Oh my! అందమంటే అందమా? నా అందము చూస్తే ఎవరికి పిచ్చి ఎత్తదు? దొరసానులు ... తెలిసిందా? England లో high class ladies నా అందము చూచి ఏమి చేసేవారో తెలుసునా?

సరో—ఏమి చేసేవారు?

పాత్రు—చెప్పనా? విను. Will you believe me? నేను రోడ్డుమీద నడుస్తూఉంటే, ద్వారాలదగ్గిర నిలుచుండి ధపాధప్! ధపాధప్!

సరో—అ దేమండో?

పాత్రు—పడిపోవడమే. తెలియు లేదూ? fainted! మూర్ఛపోయేవారు.

సరో—భయము చేతనా?

పాత్రు — Innocent creature! తెల్సుకోలేక పోయావు! భయముచేత కాదు. ప్రేమ—వలపు చేత!

సరో—ఏమిటీ!

పాత్రు—నా అందము—నా చంగము...కొంచెము నలుపన్నమాట కాని— ఏదీ ఇటుచూచు— కృష్ణావతారమానా? కాదా?

సరో—మీ కేమి తక్కువ? చాలా అందముగా నున్నారు.

పాత్రు—ఓహో! గట్టి చిక్కే! నీవుకూడా కన్ను వేస్తున్నావా ఏమి?...నేనొక్కడను, ఎందరిని భరించగలను?

సరో—లేదులేదు- నేను మనసు తిప్పుకొన్నాను.

పాత్రు—మంచిపని చేసినావు... ఇందుమతిమాట చెప్పు.

సరో—ఆమె మీ కుత్తరము వ్రాసింది.

పాత్రు—ఉత్తరమా? Letter! Epistle!—By Democles! ఇంతసేపూ ఇవ్వలేదేమి? తే! తే!

సరో—నాకు తెరపి యిచ్చినారా? మీ అందము యొక్క వ్యాఖ్యానము విననా? ఉత్తర మివ్వనా? ఇప్పుడు కదా కాస్త తీరి కయింది-ఇదిగో లేఖ (ఇచ్చును)

పాత్రు—చెలీ, నీవు కూర్చో! నా ప్రియతమకు నీవు సఖివి కావున నాకుకూడా సఖివే-కొంచెము tiffin పుచ్చు కొంటావా?

సరో—చిత్తము, వద్దు-(కూర్చుండును)

పాత్రు—పోనీ Tea, toast, bun, roast, whiskey? Champagne? Claret!ఏమీ వద్దా?...సరే,కూర్చో నే నీఉత్తరము చదువుతాను.

సరో—చదవండి...నేనూ వింటాను.

పాత్రు—Well I never-just the thing—వాహ్వా! అందుకు సందేహమా? Shake hands, my dear (చేయి పట్టుకొనును)

సరో—వదలండి నా చెయ్యి-ఇదేమిటి!

పాత్రు—అదేమి? ఓహో! మరచిపోయినాను. ఈ దేశములో ఈ custom లేదు. Barbarous country అని ఊరకే అన్నానా? సరే, నీవు వెళ్ళు-We shall meet under better stars.

సరో— మమ్మల్ని మరవకండి.

పాత్రు—మరచిపోవడమే? నిన్నా! Impossible! (ఆమె పోవును) నే ననుకొన్నంతా అయింది, చూస్తాను. **మొట్టమొదట** ప్రియతమా, which being translated into civilized language means—O my darling! మిత్రమా! ఏమని చెప్పగలను? జన్మజన్మాలకూ, ప్రతి జీవిత

మున, మరణమందున్నా నాకు ప్రాణనాథుడవు నీవే-" Language ఎంత rude గా ఉంది! కాని అర్థము సుబోధ్యమే. Be you my husband- ఓహో! అంతు కభ్యం తరమా? ఛాబో! లక్ష రూపాయిలు! మాటలా? తరువాత "మీ చరణదాసి"—ఆహా! ఉత్తరము ప్రేమతేనె ప్రవిస్తూంది...కింద నంచుతే చీమలుపట్టునేమో? By Jove! It is lucky, కాని...రెబెకా?...అదే ఆలోచించవలసిన విషయము-దాని నిదివరకే marry చేసుకొన్నాను. అది చావకుంటే ఇందుమతి నేలాగు పెళ్ళిచేసుకోవడము? చివరకు bigamy charge వస్తుందేమో? ఇదే చిక్కు! నాకోసము రెబెకా చావడాని కొప్పుకొంటుంది-దానికి నామీద అంత ప్రేమ-చూస్తా నేమంటుందో-Rebecca! Rebecca! (ఆమె వచ్చును) My dear! చెలీ, నీవు వెళ్ళు, జవాబు రేపిస్తాను. (సరో॥ వెళ్ళును)

రెబె—What, my dear?

పాత్రు—రెబెకా dear, నీవు చావాలి-

రెబె—నేనా? చావవలెనా? ఎందుకూ?

పాత్రు—చావాలి - You must die తెలిసిందా? dear, first go and hang yourself like a good girl There's dear!...go.

రెబె—Why should I do so?

పాత్రు—నీకు hanging కి objection ఉంటే

I would not insist on it. Prussic acid అనే అన్ని తను పుచ్చుకో, లేదా railway engine కింద పడు; కాకపోతే dynamite తో నీ head పగులగొట్టుకో and thus die a civilised death... ఏలాగోలాగు నీవు చచ్చిపో— అంతకన్న ఎక్కువచేయనక్కరలేదు. చస్తేచాలు. నీవలాగు చేస్తే I shall be infinitely obliged to you ever afterwards.

రెబె—I care a jot for it. చావడానికి నాకు చాలా objections ఉన్నవి.

పాత్రు—నిజమే! By St. Augustine నీకు objections ఉంటవని ఎరుగుదును. అలాగు చేయకపోతే ఇప్పుడేమి సాధనము? వేరుపాయము లేదే.

రెబె—నే నెందుకు చావాలి, ముందది చెప్పు.

పాత్రు—నీవు చావకుంటే ఇప్పుడు చిన్న మెత్తుపని జరుగదు.

రెబె—Dear, Am I a thorn in your side? నేనే వండుకొంటున్నాను, అంత నౌఖరీ చేస్తున్నాను. హిందూభార్యలాగు ఇంటి పని అంతా చేస్తున్నాను.

పాత్రు—That's true అది నిజమే. నీవు సాక్షాత్తు లక్ష్మివే; కాని, ముఖ్యమైన విషయ మేమంటే—నీవు చావకుంటే నేను లక్షరూపాయిలు lose అవుతాను.

రెబె—అ దెలాగు?

పాతు—నాకు ఒకగొప్ప వివాహసంబంధము కుదిరింది, పెళ్ళికూతురు is a widow, సంవత్సరానికి income ఒకలక్ష రూపాయిలు- Is it not a lucky job?

రెబె—లక్ష రూపాయిలే!

పాత్రు—ఔను. One lakh of rupees. నీవు నామీాద దయఉంచి చచ్చినట్టాయెనా darling, నేను నీకు యావజ్జీవమూ దాసుడనై యుంటాను- నిన్నెంతో ప్రేమిస్తాను.

రెబె—నేను చచ్చినతరువాత నీ ప్రేమ ఎవరికి కావాలి?

పాత్రు—నిజమే- నీకు గట్టి సందేహామే కలిగింది. ఏలాగు నచ్చచెప్పడము!...ఇదిగో నీవు చచ్చినట్టయితే నీకు గొప్ప గోరీ కట్టిస్తాను, రెండో Taj Mahal తయారు చేస్తాను, బాణసంచ కాల్పిస్తాను, Acetyline lamps తో funeral procession జరిపిస్తాను, European Concert తెప్పించుతాను, లేకుంటే Australian string band రప్పిస్తాను.

రెబె—ఇదంతా నిజమే, కాని మనిషంత మనిషిని నిండు ప్రాణముతో చావడ మేలాగు? నేను చావలేను.

పాత్రు—అయ్యో! స్త్రీ లెంత unreasonable గా ఉంటారు! ఏవిధానైనా చావవా? నాకు లక్షరూపాయాల నష్టము కలిగిస్తావా?

రెబె—చావకుండా ఉండే సాధన మేదైనా ఉన్నదా?

పాత్రు—నా కేదీ తోచలేదు.

రెబ—Why not divorce ? If you must get rid of me, why not divorce me on a false plea?

పాత్రు—By Madagascar! that is a fine idea. Why not divorce ? Ofcourse, you are an angel, dearest. నే నెప్పుడూ అలాగే అనుకొంటూను, అలాగే అందరితో చెప్పుతూవచ్చాను. Divorce, of course, నీ మీాద నేను దావా చేయడమా? నీవు నామీాద తేవడమా? that is the question- కానీ ఎలాగోలాగు చేతాము, వేగము పద. Dearest, నీవు నా దానివి, నిన్నెంతని పొగడుదును? Oh my darling నిన్ను నెత్తిమీాద నుంచుకొని dance చెయ్యవలెనని ఉంది. Rom ti rom ti tom— tim, tim, tim (పోవును.)

రెబె—Fie! O! Shame! Is he a type of his nation? I hope not- (పోవును.)



## —। రెండో రంగము ।—

వీరేశ్వరుని కొత్తిల్లు—దంపతులు.

వీరే—చూసినావా? పాత్రుడుగారికీ మా వదినెకూ తగినట్లు బుద్ధి చెప్పినాను. "నల్లమందు భాయి" అని నన్ను వెక్కిరించిన పాత్రుడుగారికీ మాఅన్న ఆస్తి అంతా తనదని ఒళ్లూ పై తెలియకుండా మిడిసిపడ్డ మా వదినెగారికిన్నీ తగినశాస్త్రి అయిందా?

సరో—నన్ను పెళ్ళాడినారు కాని నిజముగా నాపై మీా కనురాగ ముందా? లేక వట్టి విడంబన మేనా?

వీరే—నా కీయాస్తి సంక్రమించడానికి నీవేగా ముఖ్యాధారము? అట్టి నీపై నా కనురాగము లేదందువా? సరేకాని, నీకు నాయందనురాగ మెన్నాళ్ళనుండి పుట్టింది? ఇలాగని తెలిసియుంటే ఇదివరకే ఆస్తి చేజిక్కించుకొని యుందును. రవ్వంతైనా తెలియకుండా వ్యవహరించినావు.

సరో—మీాకోసమెంతో కష్టపడి కార్యము సాధించినాను కాని ఇందుమతికి విశ్వాసఘాతకి నౌతానని ఎరుగను; మీాకు మొక్కుతాను-ఆమెకి కొంత ఆస్తి ఇవ్వండి.

వీరే—నీ మనస్సింత మెత్తనిదా? నీమాట కాదనకుండా ఆమెకు కొంత సొమ్మిస్తానులే. మును పెప్పుడేనా నల్లమందు మొదలయినవాటికి తృణమో పణమో ఇస్తూ ఉండేది. ఇప్పుడు నేనుకూడా నెలనెలకీ కొంత యిస్తాను.

సరో—మీరింకొక్క పని చెయ్యవలెను.

వీరే—అదేమో చెప్పు.

సరో—నల్లమందు మాని వేయరాదూ?

వీరే—ఈమాట మన ప్రాచీకత్తులో లేదే? నల్లమందుకోసమే ఇంత విశ్వప్రయత్నము చేసినానే? దానిని విడిచి వేయగలనా?

సరో—నాకోసము వదలాలి. ఇద్దరమూ బాగుపడుతాము.

వీరే—పెళ్ళి కాగానే నెత్తెక్కడము ప్రారంభించినావా? ఏమి జులుము?

సరో—మీ ప్రియురాలికోసము ఈమాత్రపు పని చేయుమన్నాను. మీరీ పనిచేయలేరా? మంచిపని చేయుమన్నాను కాని పాడుపని చేయుమన్నానా? ఈ మాత్రపు మొర వినరాదా? మీ మేలుకే చెప్పినాను.

వీరే—సరే, నీకోసము తప్పకుండా మాని వేస్తాను.

సరో—ఇప్పుడు ధనవంతులైనారు కదా, నన్ను ఏలుకొంటారా? లేక తన్ని తగిలివేస్తారా?

వీరే—నాకు మహోపకారివి కదా? నిన్ను పొమ్మంటానా? భుజములమీద ఎక్కించుకొని ఊరేగిస్తాను. నీమాట చొప్పున నడుచుకొంటాను.



## —॥ మూడో రంగము ॥—

పాత్రుడు గారిల్లు. పాత్రుడు.

పాత్రు—పెళ్ళి చేసుకోవడమువల్ల ప్రయోజన మేమీ లేకపోయింది, వితంతువాస్తి చేయిజారింది; విధవ పెళ్ళాడితే గాని మొదటి పెనిమిటి ఆస్తికి హక్కు పోతుందని ఎరుగను, రహస్యముగా సరంజాము నడిపినాను, ఎవరైనా ఎగరేసుకో పోతారని భయపడ్డాను, ఎవరిసలహా పుచ్చుకోలేదు, తగినఫలము దాపుర మయింది. దురాశ దుఃఖానికి చేటు-నా నూతనవధువు వస్తూన్నది, కొంచెము కోపము నటిస్తాను. (ఇందుమతి వచ్చును) ఆహా! ఏమి ఒయ్యారము! నన్ను దగా చేసినావు.

ఇందు—ఏమిటా దగా? నే నేమి చేసినాను?

పాత్రు—Fool, ప్రత్యక్ష మవుతూంటేనే?

ఇందు—నాకేమీ కనుపించలేదు.

పాత్రు—Frying pan నుండి fire లో పడతోసినావు!

ఇందు—ఏలాగు?

పాత్రు—ఆస్తి అంతా అన్యాక్రాంత మయింది. భుజాలమీద భారము పోయి, బుర్రమీద కొచ్చింది.

ఇందు—నే నేమి చేస్తాను? నాదా దోషము? పెళ్ళి?

కెందుకు సిద్ధపడాలి మీరు? న న్నెందుకు తొందరపెట్టాలి?

పాత్రు—ఎందుకో ఎరుగవ్వూ? నిన్ను పెళ్ళాడినానా నీ ఆస్తిని పెళ్ళాడినానా? నీవు విసర్గ వని తెలుసుకోలేక పోయినాను. ఆస్తి అంతరించిపోయిందే! ఓటికుండని పెట్టుకొని కాలక్షేప మెలాగు?

ఇందు—నీవు బారిష్టరువి కదా? ఇంతమాత్రము తెలిసింది కాదా? లా చదివినావో?

పాత్రు—ఈపాటి లా తెలుస్తే practice చేసుకొని యుందును. వితంతువును వివాహమాడుదునా?

ఇందు—రెండింటికీ చెడ్డ రేవడి నైనాను. ఆస్తి అగుపడకుండా పోయింది, కాపురము గడ్డలయింది. (ఏడ్చును)

పాత్రు—ఏడు పెందుకు? నీదారి నీవు చూసుకో, నాపాట్లు నేను పడుతాను. ఈ జన్మలో నాకు సుఖములేదు-పాపపను లెన్నో చేసినాను-దొరసానిని పెళ్ళాడి బిడ్డలు కని దానిని divorce చేసినాను. మొదట సంపాదించిన సొమ్మంతా తాగుడుకింద తగులవేసినాను; brief-less barrister నై portionless widow ని పెళ్ళాడి insolvency దరి చేరినాను. ఇంకా ఏమేమో చేసినాను-ఈ పాపాల కన్నిటికీ ప్రాయశ్చిత్తము చేయించుకొంటే షోడశకళాపరిపూర్ణుడ నౌతాన...నాయందు దయజూపి సెలవిమ్ము - సుందరీ! పెద్దమ్మా! నన్ను విడిచిపెట్టు-ఇక కంటపడకు. మన మాంగళ్య తంతు తెగింది.

ఇందు — నే నెటు పోగలను? పెన్నిధికీ చెడ్డాను పెనిమిటికీ చెడ్డాను-జాతినుండి వెలి-ఇక నా కెవరు దిక్కు?

పాత్రు — దిక్కు నన్నడుగుతూన్నావా? అగ్ని ఉంది, సముద్ర ముంది, హిమాలయపర్వతా లున్నవి, Tarai jungles ఉన్నవి; యాచకులు, బైరాగులు, సన్యాసులు; వీధి నాటకులు, భక్తసమాజములు, సత్రములు, దేవాలయములు-ఎన్నో జీవనాధారాలున్నవి-నీ కెందూ అడ్డుండదు. బ్రతుకు తోవలు పదివేలున్నవి-ఇం దేది చూచుకొన్నా నా కభ్యంతరము లేదు... నేనూ పోతాను. నాకోసము నరక ద్వారాలన్నీ తీసిఉంటవి-కలకత్తాకి పోయి ఏదో society లో చేరుతాను-నాదారి నేను చూసుకొంటాను; నీపాట్లు నీవు పడు.

ఇందు — అయితే ఆ స్త్రీకోసమా నన్ను పెళ్ళాడినావు?

పాత్రు — మరి దేనికోస మనుకొన్నావు? నా కొంగు బంగారమా, గృహలక్ష్మీ, నాముద్దులమూటా! Non-trump nine! whiskeyless bottle! దయచూడు, సెలవిమ్మి. ఈపాపాత్ముని నిక విడిచిపో!

ఇందు — నన్ను దిక్కులేనిదానిగా చేయకు-నీకు సకలోపచారాలు చేస్తాను. కూడు వండుతాను, గుడ్డ ఉతుకుతాను, వాకలి ఊడుస్తాను, అంట్లు తోముతాను-ఇం కేపని కావలెనంటే అది చేస్తాను. నీయింటి చాకిరీ అంతా చేస్తాను.

పాత్రు — ఓహోహో! నా కిల్లుంటే కదా చాకిరీ

చేస్తావు? కూడుంటే కదా వండిపెట్టుతావు? నాపని అంతా పూర్ణానుస్వారమయిందే! నావెంట పడితే నిప్పుయో జనము.

ఇందు—అన్నా! ఎట్టి దుర్గతిపాలైనాను! అయ్యో! పురుషు లెంత స్వార్థపరులు! మేము స్వతంత్రులము కాము, బలహీనులము, పిరికివారము; మగవాళ్ల నాశ్రయించి బ్రతుక వలెను, భరణపోషణాదులకు వారే మాకు దిక్కు. పరతంత్రులమైన మమ్ము పెళ్ళియాడి ధనమార్జించవలెనని వారు కోరుతారు-ఛీఛీ-ఏమి మగతనము? మీ రెక్కడికి పోయినా నాలుగుకాసు లార్జించగలరు, మీ కెన్నో పనులు చేతనౌను. ఉద్యోగము చేయగలరు, వర్తకము చేయగలరు, కూలిపని మీచేత నవును; మందులూ మాకులూ తయారు చేయ గలరు; దొంగతనమున మిన్నలు, లంచాలు తినగలరు-వీటి మూలముగా ధనమార్జించి అది చాలక మమ్ము చంపి ధనము చేకూర్చవలెనని కూడా మీ ఊహ ఏమీ చేతకాని మ మ్మెడిపిస్తే మీ కేమి గొప్ప? మాఉసురు తగలి మీరు బాగు పడరు; మాజోలికి రాకండి, మీకు పదివేల దండాలు!

పాత్రు—అందుకే కదా నిన్ను వదలివేస్తున్నాను. ఇదివరకే తప్పు చేసినాను, మించిపోయింది, ఇప్పుడు విచా రించి ప్రయోజనము లేదు...ఇదిగో చెవులు నులుముకొంటు న్నాను, చెంపలు వాయించుకొంటున్నాను-ఆడదానివలలో చిక్కరాదు.

ఇందు—శుద్ధప్రేమ ప్రపంచమందే శూన్యము-ప్రేమ కోసము పెళ్ళిచేసుకోవడము పెద్దతప్పు

పాత్రు—నేను ప్రేమకోస మొకమారూ, పెన్నిధి కోస మొకమారూ పెళ్ళి చేసుకొన్నాను. రెండుసార్లూ దగా పడ్డాను. కనుక logically పెళ్ళిచేసుకోవడమే పెద్దతప్పు అని సిద్ధాంతము చేసినాను. నడువు, మన మెవరి దారిని వారు పోవచ్చును.

---

—॥ నాలుగో రంగము ॥—

---

నవనాగరకార్యమహిళామండలి-సువే॥, సుకే॥ సభ చేరినారు.

సువే—విశ్వప్రయత్నము చేసి మగవాళ్ళని ధిక్కరించి వాళ్ళమాట పోల్లుచేసి, కొట్టినంత పని జరిపి స్వాతంత్ర్యము సంపాదించినామే కాని ఈ కొత్తబ్రతుకంత వాంఛనీయముగా లేదు-అన్నీ కష్టాలే.

సుకే—ఏదైనా మనకు దొరకకుండా ఉన్నంతకాలమే ఔత్సుక్యము, అది చేత జిక్కేసరికి ఇంతేనా అనిపిస్తుంది. అసడ్డ పుట్టుతుంది. క్రమేపి అసహ్యమవుతుంది!

సువే—అసడ్డ కాదు-ఈవిషయములో అశక్తత.

సుకే—అదే-అశక్తత చేతనే అసడ్డ; కొంతకాలముకు వెగటూ పుట్టుతుంది-

సువే.—ఈవిషయము మొదట తెలిసుంటే ఇంత వరకూ రానీయకపోదును.

సుకే.—ఇంత విరతికి హేతు వేమి?

సువే.—క్రొత్తబ్రతుకు కాసిస్తే మాకు కూటికే లోపము వస్తూన్నది. ఆదాయము తక్కువ, వ్యయము హెచ్చు. మన ముద్యోగము చేయలేము కదా? మగవాళ్ళు తెచ్చిన నాలుగు రాళ్ళూ మన విలాసములకే చాలకున్నవి-ప్రతివారూ చందాలకి ఇనాముకీ బయలు దేరుతూన్నారు-మగవాళ్ళలం చాలకి చందాలకీ సొమ్మిస్తే వాళ్ళమీద మండిపడే వాళ్ళము-ఇప్పుడా ముష్టిచిప్ప మనదాకా కూడా వచ్చింది - పాడుముండ public life లో ప్రవేశించినాము. వలపలా దాపలా వడ్డించవలసి వస్తూంది. కట్టుకొన్న కాంతలము కదా అని మన వాళ్ళు మనము చెప్పినట్లు నడుస్తూన్నారు. పాత ఆదాయము క్రొత్తపోకడలకి సరిపోలేదు-ఖర్చు హెచ్చించినామే కాని కానిడబ్బు గడించలేకున్నాము-మునుపటిఖర్చులకే మ ప్పు తిప్పలా పడేవారము; ఇప్పుడు ఖర్చు హెచ్చింది, ప్రతినెలా అప్పు పెరిగిపోతూంది-ఇంక కొన్నాళ్ళిలా గుంటే ఇల్లూ వాకలీ తాకట్టు పెట్టుకోవాలి-మొదటికే మోసము వచ్చేటట్లుంది-మనము తొక్కినది తప్పుదారి, ఎంత వేగిరము దీనిని విడుస్తే అంత శ్రేయము.

సుకే.—నాకూ అలాగే తోస్తూన్నది.

సువే——నాకు డబ్బు ఎద్దడి లేనే లేదు-కాని నీకు లేని క్రొత్తకష్ట మొకటి నాకు ప్రాప్తించింది- దిక్కున్నా నా పిల్లలు దిక్కులేని దీనులలా గున్నారు- వాళ్ళకి కడుపు నిండా అన్నము పెట్టేదిక్కు లేదు - వంట వాళ్ళు ఏలాగోలాగు ముగించుకొని పరుగెత్తడానికే చూస్తారు కాని పని బాగుందో లేదో వాళ్ళ కేమి?...నేను చూసుకోవ డానికి ఏమీ వ్యవధి లేదు-తల్లిదండ్రు లున్నా సంతానము దిక్కులేని దైనది...ఇంతే కాదు, మొన్న కుఱ్ఱవాడికి కాస్త జ్వరము వచ్చేసరికి ఆ పాడుముండ బాపనక్క మజ్జిగ పోసి పొడిఅన్నము పెట్టి వాడు తినకుంటే నాలుగు కొట్టి బల వంతముగా కూరింది, దానివల్ల అజీర్ణముచేసి జ్వరము వదలక పట్టినట్లే ఉండిపోయింది-డాక్టరుగారి భార్యాతో చెప్పేసరికి ఆతని నామె పంపింది-అతని ఫీజుక్రింద అరవై రూపాయిలా లయింది-గొప్పవాళ్ళతో స్నేహము కొంప తీసింది-చినికిచినికి గాలివాన అన్నట్లు జ్వరము typhoid లోకి దింపింది-మా యింటివైద్యుడైతే మాకంత ఖర్చు లేకపోవును, జ్వరమూ హెచ్చకపోవును-Doctor గారి కేమీ చేతకాదు, ఆమాట చెప్పడు, మేము కబురంపకపోయినా రెండుపూటలా వస్తూ తనకి రావలసిన ఫీజూ మావాడి జ్వరమూ హెచ్చు చేసినాడు-అంతలో తెలివితెచ్చుకొని మేమే రావద్దన్నాము. ఫీజు బాధ తగ్గింది కాని రోగము హెచ్చి పిల్లడు మరునాడే జారిపోయినాడు-ఇదంతా అపథ్యదోషము-జావ కాచి పెట్టు

మంటే పని హెచ్చుతుందని అన్నమే పెట్టి జావ పెట్టినానని చెప్పేది-పిల్లడు నాతో చెప్పలేక పోయినాడు-ఇంటివద్ద పిల్లడికీలా గేమీ తోచకుండా ఉంటే Return tea party నే నివ్వవలసిందని నోటీసు! అమ్మలక్కలందరూ నాలుగుగంటలయ్యేసరికి బళ్ళతో సిద్ధము-పిల్లడిమాట చెప్పితే వాళ్ళందరికీ disappointment అని ఊరకున్నాను. మావారు treasury closing day కనుక రాత్రిదాకా రాలేదు-నలుగురూ రావడము మొదలుపెట్టగానే దాసిదానిని పిల్లడిదగ్గ రుంచాను-ఆ ముండ వాడిని కనిపెట్టుకొని యుండక వచ్చిపోయేవాళ్ళని చూస్తూ బుగ్గమీద వేలు పెట్టుకొని మాదగ్గరే ఉండిపోయింది- పిల్లడిప్రాణ మెప్పుడు పోయిందో తెలియదు-రెండుమూడుమార్లడిగినాను, నిద్రపోతూన్నాడని చెప్పింది; ఎంత కసిరినా వెళ్ళింది కాదు; party అంతమయినతరువాత పిల్లడిని చూతునా వట్టికొయ్య! కచేరికి కబురు పంపుదామంటే కలక్టరుగారుతనిఖీకివచ్చినారని గుర్రపువాడిని లోనికి రానిచ్చినారు కారట-దాసిదానిని బల్లలు, గిన్నెలు, పళ్ళెములు సర్దుమని చెప్పి పిల్లడిని పెట్టుకొని కూర్చున్నాను-రాత్రి మేమిద్దరమూ తోడులేక గడుపవలసి వచ్చింది - మరునాడుచూసుకొనే సరికి రెండు వెండిగిన్నెలు, నాలుగు పళ్లెములూకానరాలేదు- అవి ఎరువువస్తువులు, అచ్చుకొని తీరాలి-కొత్తఫాంతవల్ల నాకు వచ్చిన లాభమిది. మునుపటిలా నైతే ఇందులో ఏదీ జరుగకపోవును.

(సుభాషిణీ సుహాసినిన్నీ వత్తురు)

సుభా—ఏమే సువేషిణీ, కంట నీరు పెట్టుకొన్నావు? మాను మంటే మానవా? జన్మమున్నన్నాళ్లూ విచారించడమే?

సుహా—అవున్నా! సువేషిణీ! ఎంతఏడ్చి ఏమిలాభము? పోయినవాలు డిక రాడు. ఒక్క కొడుకన్నమాట నిజమే, అది మనవస్తువు కాదు- విచారించిన ప్రయోజనము లేదు- మనోవ్యాధి పెట్టుకోకు...ఊరకుండు!

సుకే—మీ రిద్దరీలాగు వచ్చినా రేమి?

సుభా—చిన్న సలహా కావలసి నేను వచ్చినాను. సుహాసిని నడిగినాను, చెప్పలే నన్నది; దాని కొక బెంగ పట్టుకుంది, తెరిపీ తెన్నూ లేక దానితో తన్నకొంటూ న్నది. మా యిద్దరికీ మతిపోయి నీ దగ్గరికి వచ్చినాము.

సుకే—నీ సలహా యేమి? దానిబెంగ ఏమి?

సుభా—నా ఉద్యోగములో చిన్న అవాంతరము వచ్చింది. ఆడదాన నని హెడ్‌మిస్ట్రెస్ పని ప్రెసిడెంటుగా రిచ్చినారు. నా కేమీ office work తెలియదు- స్కూలు కిచ్చిన తెల్లగుడ్డ లెక్కప్రకారము మిగులలేదు ఇదివర కెప్పుడూ చూసుకోలేదట; Inspectress వస్తుందనినోటీసు వచ్చింది. ఇప్పుడు మా చేసరికి తక్కువ వచ్చింది-పోనీ కొని పెట్టుదామంటే అలాటి గుడ్డదొరక లేదు-పట్నమునుంచి తెప్పించడానికా వ్యవధిలేదు. అందరు masters మగవాళ్లు, నా కెలాగైనా చెడ్డపేరు రావలెనని కట్టుకట్టినారు, సలహా

చెప్పరు- ఇంకా ఏమేమి లోపాలున్నవో తెలియదు. ఇప్పుడే ఉద్యోగ మిచ్చినారు, ఇంతలోనే లోపమువస్తే చేతకాని దాననని suspend చేస్తారో, fine వేస్తారో తెలియదు, transfer నిజము! చెయిచూపించి జేష్ఠ అనిపించుకోవలసి వస్తుంది. రెండోది, మగవాళ్ళంతా కట్టుకట్టినారని చెప్పి నానుకదా? వాళ్ళు నామాట కేదో అడ్డుకర్ర వేస్తునే ఉన్నారు. నే నావుకి పెట్టుతా నంటే వాళ్లు కుక్కకి పెట్టు మంటారు. అన్నిటిలోనూ ఆరుమూడుగా నుంది. అహో రాత్రము లదిబెంగ కాదు- సుఖాన ఉన్న ప్రాణము దుఃఖ ములో పడ్డది- మావారి కీ ఉద్యోగము బొత్తిగా కిట్టదు, పై పెచ్చు ఈవ్యవహార మాయనచెవిని వేస్తే దెప్పిపొడుస్తా రనే భయముచేత ఇంతవరకూ చెప్పలేదు. ఇప్పుడు చెప్పక తీరదు, ఏమంటే యాభైరూపాయీ లిస్తే ఇప్పుడు నా కేమీ మాట రాకుండా ఉంటుందని మా First assistant చెప్పి నాడు. అత డొక్కడే నాబాగుకోరి అప్పుడప్పుడు Cash Book వ్రాయడము, పేపర్లు set చేసి దిద్దిపెట్టడమూ మొద లైనపనులు చేస్తూంటాడు-ఇప్పుడు సొమ్ము నాకెవ్వరిస్తారు? మావారితో చెప్పడము తప్పనిసరి అయింది. ఈగండము గడిచిపోతే ఉద్యోగము మానుకోవాలని ఉంది-నా కేమి సలహా యిస్తావో నీదే భారము.

సు వే.—ఉద్యోగము చెయ్యవద్దని నేను మునుపట చెప్ప లేదా? విన్నావా నా మాట?

సుభా—ఏమి చేయు మన్నావు? మావారి జీతము మా ఖర్చుకి చాలింది కాదు, అప్పు చేయక తీరింది కాదు, అప్పంటే ఆయన కంతభయము, నా కసలే కిట్టదు-అందు చేత ఉద్యోగము చేయక తప్పింది కాదు.

సుకే—ఉద్యోగమంటే స్వాతంత్ర్యమునకు వేరువిత్తు, తల అమ్ముకొన్నవాళ్ళ కన్నీ దండుగలే- ఒకరికి కాదు ఎందరికో ఒదిగి తిరగవలెను. మగవాళ్ళతో వ్యవహారము కత్తి మీద సాము- మనసులో మాట చెప్పితే మర్యాద దక్కదు; చెప్పకపోతే చిక్కులలో పెట్టుతారు...నీ స్కూలులో వచ్చిన తవ్వాయికి మీ మేష్టరు చెప్పినదే సలహా. అప్పు చేయక తప్పదంటున్నావు కనుక ఏదైనా వస్తువు తాకట్టు పెట్టి ఎక్కడైనా సొమ్ము తేవడమే మంచిది, నమ్మకమైనవారు దొరికితే ఇదే సలహా; లేకా అమ్మివేసి దండుగ పెట్టుకోవడ మన్నిటికన్న మంచిది.

సుభా—అన్నా! ఎంతగతి పట్టించెరా దైవమా! ఇది వరకు మా సంసార మెంతో గుట్టుగా ఉండేది. దౌర్భాగ్యపు నాగరకత వచ్చినదగ్గరనుంచి దారిద్ర్యము సంక్రమించింది, దానివెంటా దాస్యమూ, లేనిపోని దండుగలూ, తగాదాలు; వీటితో ప్రాణము విసిగిపోయింది. మునుపటి రోజులే మంచివి- ఆలుమగల మెంతో అన్యోన్యముగా నుండేవాళ్ళము, ఇది వచ్చినప్పటినుండి మనోమనికి తాలు ప్రారంభించి ఇద్దరమూ

బ్రహ్మచర్యము జరుపుతూన్నాము - పాడుచదువు నా కొంప తీసింది.

సుకే.—జరిగినదానికి విచారించి ప్రయోజనము లేదు; రాతికింద చెయ్యి పడ్డది, నేర్పుతో తప్పించుకోవలెను; నలుగురూ వింటే నగుబాటుగనుక ధైర్యము వదలవద్దు- మన మగవాళ్ళందరూ ఒక విధముగా మంచివాళ్లే-ఎన్ని మాటలు మనమన్నా, ఎన్ని పనులు చేసినా, ఇంటినుండి గెంటలేదు. అదీమేలే. పైవాళ్ళెన్ని కొన్నా మనవాళ్ళకి మనయెడల మనసు విరుగలేదు-ఇదే సుగుణము.

సుహా.—నీమాట కడ్డు వచ్చినానని కోపపడకు-నేటి రోజున మావారికీ నాకూ పెద్ద తగాదా వచ్చింది-ఆయన నన వలసిన మాట లన్నారు, నేనూ ఊరకుండక నాకు తోచిన రీతిని నాలుగు దులిపినాను-అంతట ఆయనకి పట్టరాని కోపము వచ్చి, “మే మూరకున్నకొద్దీ మీ పెడసరము హెచ్చిపో తూంది-మాదగ్గిర నున్నంతకాల మీలాగే సాగుతుంది; ఇంటిలో నుంచక బైటికి గెంటివైతే నా అన్నవాళ్లు లేక మీ రనాథ లౌతారు, అప్పుడు మీపాట్లు కుక్కలైనా పడవు, మీ పాపమంతా పండి పదిమందిచేత ఛీఛీ అని పించుకొని దిక్కులేకుండా పోతారు సుమా” అని శతా యించినారు. నిజమే-ఇల్లులేని ఇల్లాలి పాట్లెన్నీ అన్నీ అని చెప్పతరమా? అన్నంతపనీ చేస్తారేమో అని అడలు పుట్టింది- ఏమీ తోచదు-ఎప్పుడు తన్ని గెంటివేస్తారో? ఎవరు దిక్కు,

ఏమి దారి అని బెంగపెట్టుకొన్నాను; నా కేమి ఆలోచన చెప్పుతావో అని వచ్చినాను.

సుకే__ఆలోచన కేముంది? అంతవరకూ రానీయనే కూడదు-సువేషిణీ, నేను కూడా స్వానుభవముచేత ఇప్పుడే మనము కొత్తదారిని నడవడము మాని వేతామని నిశ్చయించుకొన్నాను. నవనాగరకత మాకు కూడా నచ్చలేదు. ఎప్పుడు పాతదారిలో పడతామా అని చూస్తూన్నాము.

సుభా__బాగుం దాలోచన-మన గౌరవ మాలాగైతేనే నిలబడుతుంది, లేకుంటే నగుబాటు సిద్ధమే. చేసేదేదో త్వరగా చేతాము, విలంబనమైతే విషమిస్తుందేమో?

సుభా__ఈ నాగరకత దొరసానులకే చెల్లుతుంది కాని మనకు సరిపడదు.

సుకే__ఆదర్శ మొకటీ ఆచరణ మొకటీ అయినట్టయితే ఇదే ప్రమాదము-మనఆదర్శము స్వాతంత్ర్యము కనుకూలింపదు-న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి అని మనపూర్వులు శాసించినారు. పశ్చిమ దేశములందో మగవాళ్ళూ ఆడవాళ్ళూ సమానాదర్శములనే సాధిస్తారు, వారి యాచరణ అందు కనుకూలముగా నుంటుంది; మనకో, ఆదర్శ మొక తెన్ను ఆచరణ మొక తెన్ను; ఎద్దు ఎండకీ పోతు నీడకీ లాగితే బండి ఎటు కదులుతుంది?...ఇంతటితో చాలు నవనాగరకత-నేడు మన మగలతో "మేము పాతరీతిని మెలగుతాము, కొత్త రీతి మాకు సరిపడలేదు మానుకొంటా" మంటే వాళ్ళూ

సంతోషిస్తారు, మనబెంగా తీరిపోతుంది. తక్కినసంగతులు తాపీమీాద మాట్లాడుకొందాము.

సుభా—నాకు తొందరగా నుంది, నేటిరాత్రి మా వారితో నా కష్టాలన్నీ చెప్పుకొంటాను.

సుహా—నేనూ అలాగే చేస్తాను-ఆలస్యము చేస్తే కొంప మునుగుతుంది.

సుకే—బాగానే ఉందికాని పలచన చేస్తారేమో అని భయముగా నుంది. బెట్టుగానే ఉంటే బాగుండును; పరిస్థితులు ప్రతికూలించినవి. మార్గాంతరము లేదు. (పోవుదురు)

---

## —। ఐదోరంగము ।—

---

పాత్రుడూ సుబ్బయ్య.

పాత్రు—అయ్యా! నేను కొన్ని తెలివితక్కువపనులు చేసినాను-ప్రాయశ్చిత్తము చేసుకొంటే అవి తుడుచుకొని పోతవా?

సుబ్బ—సందేహ మేమి? పాపహారణమే ప్రాయశ్చిత్తానికి పరమోపయోగము, మహాపాతకాలనే హరిస్తుంది ..."ప్రాయో నామ తపః ప్రోక్తం, చిత్తం నిశ్చయ ముచ్యతే" అన్నారు- నిశ్చయముగా తపస్సుచేత నేవేవి సిద్ధి

స్తవో అవన్నీ దీనివల్ల చేకూరుతవి. మీా విషయమున ప్రత్యే కముగా కారిక ఉంది—

అభోజ్యానిచ యో భుంక్తే పేయాని చ యః పిభేత్
తస్య కుర్యాత్ క్షురం క్షిప్రం భక్షణం గోమయంతథా।
దక్షిణాన్ బ్రాహ్మణేభ్యస్తు దానం పండితవర్యయోః॥

ఈ విధముగా ప్రాయశ్చిత్తము ముగిస్తే పాపనిర్మూలన మవుతుంది.

పాత్రు—ఏమేమి సామగ్రి సిద్ధము చెయ్యావలెనో చెప్పండి.

సుబ్బ—ఎంతో తంతు లేదు. ధనలుబ్ధులైన వైదిక ఛాందసులు దానాలని, హోమాలని చెప్పి సాధ్యమయినంత సొమ్ము పిండుతారు. అదంతా వట్టి భేషజము అమాయికులైన ప్రజలను నానాబాధలపాలు చేస్తారు. నే నంతా సూక్ష్మములో తేల్చివేస్తాను. పలుగురికి నాలుగు కాను లిస్తే సరి. "మూర్ధం ముండేత్, తక్రం వర్షేత్"— అనగా కొంచెము క్షురసంస్కారము చేసుకొని, చల్ల చిలికితే సరి; ఆపైని "గోమయం భక్షేత్"—గోమయం సేవించాలి- అంతతో సమాప్తి, చూశారా? ఎంత సంగ్రహపరచినానో ? చాదస్త మంటే నాకు పడదు. సూక్ష్మములో మోక్షము సిద్ధించేలాగు చేస్తాను.

పాత్రు—గోమయం సేవించడమంటే ఏమి?

సుబ్బ—గోమయ మంటే ఆవుపేడ.

పాత్రు—దానితో నేమి చేస్తారు?

సుబ్బ—అది లోపలికి పుచ్చుకోవాలి.

పాత్రు—ఛీఛీ! అది తగ్గించలేరా?

సుబ్బ—తినరాని పదార్థాలు తిన్నారు, తాగరాని పదార్థాలు తాగినారు. ఆ కల్మషము పోయే మార్గ మదొక్కటే, వేరు సాధన ముంటే మాని యుందును, మీరు చెప్పనక్కర లేదు.

పాత్రు—అంతకన్న పీకాయపచ్చడో, ఆమీద మో పుచ్చుకొంటే నాలుగు విరేచనా లవుతవి, కల్మష మంతా పైకిపోదా?

సుబ్బ—ఆపని కావలిస్తే తరువాత చేయవచ్చును, గోమయము మాత్రము తప్పదు. "పాపాపనోదనిపుణం గోమయం పంచితం తథా" అని ధర్మశాస్త్రము-సేవించడ మంటే ఎంతోనా? ఉసిరికకాయంత అని చెప్పతారు కాని నేను మాత్రము కుంకుడుకాయం తే నిర్ణయించినాను. మీ విషయములో మాత్ర తగ్గిస్తాను, పెసరగింజంత సేపిస్తే సరి. ఆత్యావసరము గనుక ఇంతదూరము చెప్పుతూన్నాను.

పాత్రు—ఆవగింజంత అందురూ, ఏదో సంస్కారము కోసము కదా మీ పట్టు-మాత్రనిర్ణయ మెందుకు? మీరు పట్టు సడలించండి.

సుబ్బ—అలాగే కానీయండి.

పాత్రు—మీ చేతిలో చిక్కినాను, మీ చిత్తము వచ్చినట్లు చేయండి-త్వరగా మాత్రము కానీయండి.

సుబ్బ—ఆరో చెవి వినకుండా కార్యము నడిపిస్తాను. నాకు సెలవా మరి? ప్రశీదీ మీ యిష్టముచొప్పునే నడుపుతాను. "యథాశక్తి" అని శాస్త్రమే ఉన్నది. తిరిగీ దర్శనము చేసుకొంటాను. (వెళ్ళును)

పాత్రు—దీనితో పీడ వదలుతుంది, ప్రాయశ్చిత్తమయితేనేకాని బ్రతుకలేను. దొరల ఆచారాలు మన దేశానికి సరిపడవు, తెల్లవాళ్ళ వేషము నల్లవాళ్ళకు సరిగా అమరదు; ఆ తిండి యిక్కడ రుచించదు. మొదట రెండు దేశాలకీ సాదృశ్యమే లేదు. ఆవ్యవహారా లిక్కడ రాణించవు. వృథాధనవ్యయమును, సుఖము సున్న...అప్పడూ పాలుకొక్క తయారు చెయ్యి. (వాడు వచ్చును)

అప్ప—చిత్తము.

పాత్రు—ఏమి నౌకర్లు! తిట్టీ తన్నీ పనిచేయించుకో వచ్చును. నా క్షేమసరు. పూర్వపు నౌకర్లూ చాకర్లున్నూ ఇంటిలోవాళ్ళలాగే మెలగేవారు, యజమానులు కూడా వాళ్ళని బాగా గౌరవిస్తూ ఉండేవారు. ఇప్పుడు కుక్కపిల్లలని ఎత్తుకొని ముద్దులాడుతారు కాని కూలివాళ్ళని మంచి మాటేనా ఆడరు. పూర్వము నౌకర్లను వావి వరుస పెట్టి పిలిచేవారు. రెండుమూడు తరాలదాకా యజమానులని వాళ్ళు కనిపెట్టుకొని యుండేవారు. దొంగతనమూ

మోసమూ ఎరుగకుండా ఉండేవారు- ఇప్పుడో రోజు కో నౌఖరు (అప్పుడు హుక్కా తెచ్చును)

పార్వతీశం—తెచ్చినావా? అక్కడుంచు బాబూ! (హుక్కా పీల్చి) హుక్కా పీలుస్తే ఉత్సాహము హెచ్చుతుంది. మనవాళ్ళ ఆచారాలు మంచివి- నిమ్మకాయంత గుడాకుతో నిలువెల్ల పొగ-పదికాసులు ఖర్చుపెట్టితే పది మందికి చాలును. బాబో! దొరలచుట్టలు ఒక్కొక్కటి పావలా, పదితులాల బరువు, పెదవులు లాగుతవి. ఇంతా చేస్తే కంపు. అదేనా ఒక్కడే కాల్చవలెను, ఒక్కసారితో తీరదు. ధనములేని ఈదేశములో దొరల్లా గుండలేము... కుర్చీలు, టేబిల్సు, cupboards, cabinets, curtains, ఎంత పటాటోపము! పయిసాలేని వాళ్ళ కిది పడనే పడదు. మనఋషులు ఎంత మంచి సదుపాయాలు చేసినారు! ఒక్క చాపమీద ఎందరో కూర్చుండవచ్చు, పడుకోవచ్చు; ఒక్క కంబళీ ఎందరో కప్పుకోవచ్చును...దుస్తు లెంతసంక్షేపించినారు! కట్టుకోనేటందుకు పంచ, కప్పుకోనేటందుకు కండువా-పంట్లాము, కోటు, కమీజు వీటికన్న ఆ రెండూ ఎంత చవక! ఎంత సౌఖ్యము! కాళ్ళు ముడుచుకో వచ్చును, చాపుకో వచ్చును. జోళ్ళకిబదులు చెప్పులు! ఎంత సుళువు!... దొరలా గుంటే రోజూ క్షవరము చేసుకోవాలి, చాకలిచేత బట్ట లుతికించుకోవాలి-పిల్ల లుంటే ఖర్చు అపరిమితము- wet nurse, dry nurse, Ayah—ఇంకా push push

పౌడర్లు, toys--ఎంత కమాటము! ధనముతో పులిసిఉన్న వాళ్ళు తట్టుకోగల రేమో కాని దరిద్రులు తల్లడపడక తప్పదు- నాబోటివాళ్ళు నానాపాట్లూ పడవలెను. ఈదేశస్థుల కిక్కడి ఆచారాలే తగియున్నవి, విదేశపుపోకడలు విష మిస్తవి. ఎక్కడివా ళ్ళక్కడికి తగియుండవలెను. "స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః" తెలివితక్కువచేత తప్పుతోవ తొక్కితే దండన తప్పదు. నేనే తార్కాణము. పాతపోకడలే పరమసుఖదాయకములు. (తెరదిగును)

సంపూర్ణము

